


అది ఒక మారుమూల దేశం. ఆ దేశంలో ప్రజలైతే వున్నారుకాని, పాలించే రాజు లేడు. రాజులేని ఆ దేశంలో ప్రజలు ఎవళ్ల యిష్టానుసారం వాళ్ళు ప్రవర్తిస్తూ వచ్చారు. ఇలా నాథుడు లేకపోవడంవల్ల ఆ రాజ్యానికి 'అనాథ రాజ్యం' అని పేరు వచ్చింది.

కాలక్రమాన ఆ దేశానికి రాజులు వచ్చారు, పరిపాలనా చేశారు, ప్రజలను ఒక కట్టుబాటులో వుంచి, వారికి సౌఖ్యమూ చేకూర్చారు. ఇన్ని మార్పులు వచ్చినా, ఆ దేశానికి అనాదిగా వుంటున్న అనాథ రాజ్యమనే పేరుమాత్రం అలానే నిలిచి పోయింది.

అటువంటి అనాథరాజ్యాన్ని ఏలిన రాజుల్లో కృపాసింహుడు ఒకడు. కృపాసింహుడు తనహయాములో ప్రజల క్షేమం కోరి ఎన్నోమార్పులు చేశాడు. కాని, అది నుండివస్తున్న కొన్ని విడ్డూరపు ఆచారాలను మాత్రం సరిదిద్దలేకపోయాడు. అటువంటి విడ్డూరపు ఆచారాలలో 'నామకరణ మహోత్సవం' ఒకటి.

అనాథరాజ్యంలో, రాజవంశంలో జన్మించిన ఎవ్వరికీ మనకుమోస్తరుగా పేరు పెట్టుకోటానికి స్వతంత్రత లేదు. ఒక శిశువు జన్మించిందీ అంటే పుట్టిన రోజునే నామకరణ మహోత్సవం జరిపించాలి. ఆ మహోత్సవానికి చుట్టుపక్కలవుండే రాజులందరూ వస్తారు. వారంతా ఒక్కొక్కరు ఒక్కొక్క పేరు సూచిస్తారు. ఆ పేర్లన్నీ ఒక గ్రంథంలో లిఖించి, దానిని భద్రపరుస్తారు. పదహారేళ్ళు వచ్చేవరకూ ఆ బిడ్డను 'రాకుమారుడు' అనిమాత్రమే



పిలుస్తూ, పదహారవయేడు రాగానే ఆ పేర్లను రాకుమారుడికి చూపించి తనకు నచ్చినపేరు ఎంచుకోమంటారు. అలా రాజకుమారుడు ఎంచుకొని ప్రజలకు తెలియజేస్తే ఆపేరే నాటినించీ అమలులోకి వస్తుంది.

కృపాసింహుని పరిపాలన అన్నివిధాలా బాగానే వున్నది. కాని, ఏభైఏళ్ళు పైబడినప్పటికీ సంతతి లేకపోవడం అతనికీ, రాజ్యంలోని ప్రజలకూ కూడా తీరని విచారకారణమయింది. 'మన ప్రభువుకు వేలెడంత నిసుగు లేకపోయెకదా!' అని ప్రజలందరూ చింతించేవారు. కాని, రాజ్యంలోకల్లా ఇందుకు సంతోషించినవాడు ఒకే ఒక్క వ్యక్తి వున్నాడు. అతడే రాణీగారి తమ్ముడు శక్తిసింహుడు.

రాజూ, రాణీ సంతతికోసమని తపించిపోతూవుండగా, శక్తిసింహుడు మాత్రం వారికి సంతతి కలగకూడదని ముక్కోటి దేవతలకూ మొక్కుతూ వుండేవాడు. తన బావమరది యిక ఎంతకాలం జీవించబోతాడు? అతని తదనంతరం అక్కగారు తననేకదా గద్దెమీద కూర్చోపెడుతుంది! అని అతడు ఉవ్విళ్ళూరుతుండేవాడు. ఐతే, తానొకటి తలిస్తే దైవమొకటి తలిచినట్టయింది.

కృపాసింహుడి తపస్సిద్ధి ఫలించి రాణి దేవప్రియ గర్భం ధరించింది. ఇది తెలియగానే శక్తిసింహుడికి గుండెల్లో రాయిపడింది. రాజ్యంలో ప్రజలందరూ శుభవార్త ఎప్పుడు వింటామా అని కనిపెట్టుకుని వున్నారు. శక్తిసింహుడు మాత్రం లోలోపల కుళ్లి కుసినారిపోతున్నాడు. తను కట్టుకున్న గాలిమేడలన్నీ కూలిపోయినవే! ఇప్పుడు గత్యంతరం ఏమిటి? అని దీర్ఘాలోచనలో పడ్డాడు.

ఇక రేపో మాపో పురుడు వస్తుందనగా అతడు ఒకనాటిరాత్రి అంతఃపుర దాదిని

రహస్యంగా పిలిచి "నాకు నీవల్ల కాదగిన గొప్ప సహాయం ఒకటున్నది. నేడో రేపో మా అక్క బిడ్డను కంటుంది. అది ఆడశిశువు అయితే ఏబాధా లేదు. మగశిశువు అయిన పక్షంలో సమయంచూచి, పిట్టకైనా తెలియకుండా ఈ మందును బిడ్డకు పట్టాలి" అంటూ ఒక పొట్లం చేతికిచ్చాడు. తనకు రాజ్యం వస్తుందనీ, తను గద్దె ఎక్కిన తర్వాత కోరుకొన్న బహుమతులన్నీ ఇస్తాననీ ఆ దాదికి అనేకవిధాల ఆశపెట్టాడు.

ప్రజల అదృష్టం పండి కృపాసింహునికి కొడుకే పుట్టాడు. నామకరణ మహోత్సవానికి అతివైభవంగా ఏర్పాట్లు జరిగినై. పట్టణమంతా కలకల్లాడుతూ వున్నది. ఇరుగు పొరుగు రాజులందరూ వచ్చేశారు. దర్బారు కిటకిటలాడుతూ వున్నది. ఈ మహోత్సవం దిగ్విజయంగా జరిపే బాధ్యతఅంతా శక్తిసింహుడికే వప్పజెప్పాడు రాజు. శక్తిసింహుడు తన అయిష్టతను ఎంతమాత్రమూ పైకి తెలియనీయలేదు.

పురుడు రావటంతోనే ఆస్థానవైద్యుడు రాణినాడి పరీక్షించాడు. అంతా సవ్యంగానే వున్నదన్నాడు. బాలెంతకు అవసరమయిన మందులు ఇచ్చి, దర్బారులోని మహోత్స






వానికి తనుకూడా పోయాడు. అక్కడ రాజు అతిథులందరకూ స్వయంగా ఆహ్వానిస్తున్నాడు.

రావలసిన వారందరూ వచ్చేశారు. బిడ్డడి పేరు లిఖించటానికని దర్బారులో గ్రంథం తయారుగా వున్నది. మహోత్సవానికి వచ్చిన ఇరుగు పొరుగు రాజులందరూ వారువారు కూర్చుకొని వచ్చిన పేర్లను ఎప్పుడు గ్రంథంలో లిఖిద్దామా అని ఆత్రంతో వున్నారు. అన్నీ అమరిపోయినై. ఇక రాణీ రావటమే తరువాయి.

అక్కడ అంతఃపురంలో రాణీకి ఎప్పుడు కునుకు పట్టుతుందా, ఎప్పుడు మందుకలిపి బిడ్డడికిద్దామా అని దాది కనిపెట్టుకుని వుంది. ఆమె అలా కన్నుమూసిందో లేదో రొండినున్న మందుపొట్లం తీయబోయింది. ఇంతలో రాజుపంపిన పరిచారికవచ్చి గది వాకిట నిలబడి, "అమ్మా! అంతా తమ రాకకు ఎదురుచూస్తున్నారు" అని చెప్పింది.

దాది వులిక్కపడింది. రొండినున్న పొట్లం తియ్యలేదు. రాణిని మేల్కొల్పి, "అమ్మా! మహారాజావారు కబురంపారు. ముస్తాబుఅయి త్వరగా వెళ్లాలి" అని తొందరపెట్టింది.

రాణీలేచింది. ముస్తాబు చేసుకొంటోంది. ఈ అదునుచూచి, దాది మందుని బిడ్డకిచ్చే పాలల్లోకలిపివేసింది. తొట్టిలోవున్న బిడ్డడిని తీసుకుంది. తీరా పాలు పట్టబోయేటంతలో మళ్ళీ కబురువచ్చింది, అందరూ కనిపెట్టుకొని వున్నారని.

ఈ కబురు వినగానే రాణి "ఓసీ, దాదీ! నువ్వు బిడ్డణ్ణి ఎత్తుకుని ముందుగా సాగుతూ వుండు. వెనకాతలే వచ్చేస్తున్నానని రాజావారితో మనవిచెయ్యి" అన్నది.

దాది మారుమాట చెప్పలేకపోయింది. బిడ్డడినెత్తుకొని దర్బారుకు బయలుదేరింది. ముందు దాసదాసీజనం బారులుతీర్చి

నడుస్తున్నారు. దాది ఒకచేత్తో బిడ్డనెత్తుకుని ముందు నడుస్తున్న పరిజనాన్ని రెండోచేత్తో సర్దుతూ వారివెనుక వెళుతున్నది. దర్బారును సమీపించారు. దర్బారువాకిట శక్తిసింహుడు నిలబడివున్నాడు. తను చెప్పిన పని పూర్తిచేసి, బిడ్డడు చనిపోయాడనే కబురు తెస్తుందికదా అని ఎదురు చూస్తున్నాడు. అందుకు బదులుగా యిప్పుడు బిడ్డడిని ఎత్తుకొని దాది రావటం కనబడేసరికి, అతడు ఉగ్రుడైపోయాడు. నిలబడిన చోటునుండి కదలకుండానే దాదివైపు తీవ్రంగా చూచాడు.

దాది బిత్తరపోయింది. బిడ్డ జారి కింద పడి కెవ్వుమన్నది. అయితే మేళతాళాలతో మారుమ్రోగుతున్న ఆ సమయంలో బిడ్డడి ఏడుపు ఎవరికి వినబడుతుంది?

దాదికి ఒళ్ళు కంపించిపోయింది. గభీమని బిడ్డను లేవదీసి మామూలుగా ఎత్తుకున్నది. అందరూ దర్బారు మందిరము చేరుకున్నారు. రాణిగారు వెనకాతలే వస్తానన్నారని దాది రాజుకి చెప్పింది.

ఇది విన్న రాజు ఆశ్చర్యపోయాడు. "కబురుమీద కబురువెళ్ళినా రాణిరాలేదు సరికదా, బిడ్డడిని ఒంటరిగాకూడా పంపిందే.






ఒకవేళ స్వస్థతగా లేదోమో! తమరొక్క పర్యాయంవెళ్ళి రాణివారిని చూచిరండి" అని అస్థానవైద్యుడిని పంపాడు.

అస్థానవైద్యుడు వెళ్లి రాణీని దర్శించి తను వచ్చినపని మనవిచేసుకొన్నాడు.

రాణీ చిరునవ్వునవ్వి, "మరేమీలేదు. కొంచెం నీరసంగావున్నది. అందువల్ల బిడ్డని ముందుగా పంపాను. మీకు అనవసరంగా శ్రమకల్పించాను" అని నొచ్చుకొన్నది.

"ఎంతమాట! ఎంతమాట!! ప్రభువుల సేవకంటే మాకుకావలసింది ఏమిటుంది? తమరు ఈమందు పుచ్చుకోండి. నీరసం తగ్గిపోయి కులాసాగా వుంటారు" అంటూ అస్థానవైద్యుడు, ఎదోమందుతీసి రాణీకి అందించాడు.

రాణీ అందుకొంటూ "ఇక తమరు వెళ్ళండి. క్షణంలో నేనూవచ్చి చేరుకుంటున్నానని నామాటగా మహారాజా వారికి మనవిచేయండి" అన్నది.

అస్థానవైద్యుడు తిరిగివచ్చి, "మరేమీ లేదు మహారాజా! పచ్చిబాలెంత కనుక కొంచెం నీరసంగా వున్నారు. అది తగ్గటానికి ఔషధంయిచ్చి వచ్చాను. మరొక్క క్షణంలో వారూ చేరుకోగలరు" అని మనవి చేసుకున్నాడు. రాజు స్థిమితపడ్డాడు.

శుభ ముహూర్తం ఇంకొక్క అరగంట మాత్రమే వున్నది. అయినా, రాణి రావడం కనపడలేదు. అందుచేత 'నీవేపోయి దగ్గరుండి రాణిని తీసుకురా' అనిచెప్పి రాజు దాదిని మళ్ళీ పంపించాడు. బిడ్డనెత్తుకునే దాది మళ్ళీ అంతఃపురానికి వెళ్ళింది.

రాణిగారి శయ్యాగృహం సమీపించబోయేసరికి, లోపలినుంచి ఒక వృద్ధురాలు బయటికివచ్చింది. ఈమె ఎవరికీ తెలియని కొత్తవ్యక్తి. ఆమె దాదివేపు మిర్రిచూచి,— "బిడ్డను మళ్ళీ పడవేసేవ్, జాగ్రత్త!!" అని హెచ్చరించింది.

ఈమాటకు దాది ఉలిక్కిపడి,—"ఎవరవు నీవు? అంతఃపురంలోకి నిన్ను ఎవరు రానిచ్చారు? నాసంగతి నీకెలా తెలిసింది? నన్ను అజ్ఞాపించటానికి నువ్వు ఎవరవు? ఫో ఫో నీదారిని. ఎలా వచ్చావో అలా వెళ్లిపో" అని బూకరించింది.

వృద్ధురాలు చలించలేదు. నిలకడగా అలానే నించుని,—"వెళతాలే. నీకు ఒక మాట చెప్పిపోవటానికని వచ్చాను. జాగ్రత్తగా విను. ఇప్పుడు రాజ్యంలో అమలు జరుగుతున్నది మూఢాచారం. ఎవరెవరో వచ్చి పేర్లు రాయడం ఏమిటి? ఆ పేర్లన్నీ పదహారేళ్లవరకూ దాచివుంచడ మేమిటి? అందులోనించి ఒకపేరు ఎంచుకోవడమేమిటి? ఎవరికితోచినపేరు వారు ముచ్చటగా పెట్టుకొనటానికి స్వతంత్రత లేకపోవడమేమిటి? ఈ దురాచారం ఇంతటితో అంతరించాలి. ఇప్పుడు పుట్టినబిడ్డకు మహారాణీ జ్ఞాపకార్థం 'దేవసింహుడు' అని పేరు పెట్టమన్నానని మీ రాజుతో చెప్పు. తలిదండ్రుల పేరు నిలబెట్టడమే వంశానికి మర్యాద!" అని చెప్పింది.

దాది ఆవేశంతో "ఓసీ, శకునపక్షీ! ఎక్కడ దాపరించావే? తలిదండ్రులు



జీవించివుండగా ఆపేరు శిశువుకు పెట్టవచ్చునా? ఎటువంటి ఓటిమాట వచ్చింది నీ నోటివెంట? పైగా, తరతరాలుగా వస్తున్న ఆచారాన్ని ఉల్లంఘించమంటావా? ఏమిటీ పిచ్చికూతలు? ఏమిటీ అపశకునపు పలుకులు? ఉండు నీభరతం పట్టిస్తా. ఏమనుకున్నావే! రాజుగారితో చెప్పివస్తా ఉండు" అంటూ దర్బారుకు పోబోయింది.

పోబోతున్న దాదిని వృద్ధురాలు వెనక్కు లాగి, "తొందరపడకు. నీవు రాజుతో చెప్పవలసినవార్త వున్నదిలే. చెప్పి వద్దువు గానిలే" అంటూ అదృశ్యరూపం పొంది కిటికీగుండా ఎగిరిపోయింది.

దాది, ఆవేశంతో ఉరకలేసుకుంటూ బిడ్డ నెత్తుకుని దర్బారుకు పరుగెత్తింది.

అక్కడ దర్బారులో 'రాణీగారు ఇంకా రాలేదేమిటి? ఇంకా రాలేదేమిటి?' అని అందరూ ఎదురుచూస్తూ వున్నారు. ఇంతలో దాది ప్రవేశించింది. దాది కంగారుతో వుండటం చూచి, రాజు కంగారుపడ్డాడు. రాజు కంగారుపడటం చూచి, మంత్రులూ, మహోత్సవానికి వచ్చిన రాజులూ లక్షల కొద్దీ ప్రజా సందిగ్ధంలో పడ్డారు.

దర్బారు దర్బారంతా కారణం తెలియకుండానే అట్టుడికినట్టు ఉడికిపోతున్న సమయంలో కోటలో గంటలు వినిపించినై. అయ్యో! అవి మామూలుగంటలు కావు. మరణగంటలు !!!—అందరూ నిశ్చేష్టులయ్యారు. శరీరాలు కంపించిపోతున్నయి. వంటిమీద చైతన్యం లేకుండానే ఒక్కొక్కళ్ళు గంటలు లెక్కిస్తున్నారు.

అనాథరాజ్యంలో ఇదిపక ఆచారం: రాజకుటుంబంలో ఎవరైనా చనిపోతే, ఆ చనిపోయిన వ్యక్తికి ఎన్ని ఏళ్ళున్నాయో అన్ని గంటలు కొడతారు. ఇప్పుడు ఎవరు మరణించారో గంటలు పూర్తిఅయ్యేవరకూ ఎవళ్లకూ తెలియదాయె. భయంతో భీతాహంతో హడిలిపోతూ, ఒక్కొక్కళ్లూ ఒకటీ ...రెండూ...మూడూ...అంటూ గంటలు లెక్కిస్తున్నారు.

అలా వరసని ముప్ఫైతొమ్మిది గంటలు కొట్టి ఆగింది. ముప్ఫైతొమ్మిది ఏళ్ళు రాజకుటుంబంలో ఎవరికి వున్నాయా అని ప్రజలు గుసగుసలాడజొచ్చారు. ఎక్కడి జనం అక్కడనే చెల్లాచెదరై, వర్తమానం తెలుసుకోవాలనే తహతహతో కోటవేపు పరుగులెత్తసాగారు. ఇక నిప్పుడు దర్బారులోనేకాదు, కోటలోకూడా సంతోషమంతా కల్లోలంగా మారిపోయింది! (ఇంకావుంది)






## 2

ప్రజలంతా గంట స్తంభం దగ్గరకు పరుగు లెత్తి గంటలు లెక్కపెడుతున్నారని చెప్పాం కదా? అయితే, యింతలో రాణి చనిపోయి నట్లు గంట స్తంభానికి కబురు ఎలా వెళ్లింది? నిజానికి, రాణి చనిపోయినట్లు ఒక్క వృద్ధు రాలికితప్ప మరో పురుగుకి తెలియదే. అంతే కాదు. గంట స్తంభంవద్ద కాపలావాడితోసహా అందరూ దర్బారులోనే వున్నారాయె!

ఎప్పుడైతే గంట చెవినిపడిందో, గంట స్తంభం కాచే కాపలావాడుకూడా నివ్వెర పోయాడు. ఎవరో అటగోటితనానికి గంట మ్రోగిస్తూవుండివుండాలి. ఒక్క క్షణం ఆలస్యంజరిగినా రాజ్యమంతా అల్లకల్లోలం అయిపోతుంది. అందుచేత ఒక్కపరుగున వెళ్ళి గంటస్తంభం చేరుకొన్నాడు. చూడగా గంటలు కొడుతున్నది ఒక వృద్ధురాలు! అయితే అప్పటికప్పుడే ఆమె ముప్పైతొమ్మిది గంటలూ కొట్టటమూ, ప్రజలంతా అక్కడికి చేరిపోవటమూకూడా జరిగింది. ఇలాంటి దారుణానికి ఒడిగట్టిన ఆ వృద్ధురాలిని అమాంతంపట్టి చీల్చివెయ్యాలనే తలంపుతో ఆమెని పట్టుకోబోయాడు. కాని వృద్ధురాలు అదృశ్యరూపం పొంది ఎగిరి చక్కాపోయింది.

కాపలావాడు గజగజ వణికిపోయాడు. రాణి చనిపోయిందా? ఎలానమ్మటం? ఈ వార్త ప్రజలలో పాకిపోకముందే నిజమో అబద్ధమో తను తెలుసుకోవాలి. అక్కడ చేరిన గుంపును నెట్టుకొని ఒక్కపరుగున అంతఃపురంలో చొరబడ్డాడు. రాణీ శయ్యా గృహం ప్రవేశించాడు. రాణీ చిరనిద్రలో



వుండటంచూచి నివ్వెరపోయాడు. జలజల కన్నీరుకారుస్తూ, బరువుగా అడుగులు వేసు కొంటూ గదిలోంచి బయటకువచ్చేశాడు.

అప్పటికే గంటస్తంభంనుంచి మరలి అంతా తిరిగి అంతఃపురానికి చేరుకున్నారు. రాణీ శయ్యాగృహంలోంచి దుఃఖసముద్రంలో మునిగివస్తున్న కాపలావాడినిచూచి అంతా వారికి తెల్లమైపోయింది. అంతఃపుర మంతా "రాణీ,...రాణీ" అనే కేకలతో మారుమ్రోగిపోతున్నది !!

ఇక అక్కడ రాజుపరిస్థితి ఎలావున్న దంటే—ఎప్పుడైతే మరణగంట చెవిని పడిందో అప్పుడే గుండెదడ పట్టుకున్నది. ఒక్కొక్కగంట కొట్టినప్పుడల్లా, తన గుండె మీద సుత్తిదెబ్బ కొట్టినట్టే అనిపించింది. ముప్పైతొమ్మిదోగంట చెవిని పడీపడటం తోటే, రాజు కూర్చున్నవాడు కూర్చున్నట్టే సొలిపోయాడు. ఐతే చూడవచ్చిన రాజులు తప్ప, రాజపరివారంలో ఒక్కరూ అక్కడ లేరు. వాళ్ళు రాజుసంగతి మరిచిపోయి, గంటస్తంభంవైపుకి పరుగులెత్తారు.

తీరా యిప్పుడు అంతా తెలిసివచ్చిన తర్వాతగాని ఎవరికీ రాజుసంగతి స్ఫురణకు రాలేదు. "అయ్యో! అంతా యిక్కడనే వున్నామే. బావ ఏమయ్యాడో" అంటూ కంగారుపడ్డాడు శక్తిసింహుడు.

"అవును. ఇది మహాకలవర సమయం. బావగారు దర్బారులోనే వుండివుండాలి. మీరువెళ్ళి వారిసంగతిచూడండి. క్షణంలో నేనూ వచ్చేస్తున్నా" అన్నాడు మంత్రి.

శక్తిసింహుడు బయలుదేరాడు. అతని వెనుకనే తక్కిన పరివారం కదిలారు. వాళ్లతోపాటు ఆస్థానవైద్యుడూ, దాదీకూడా పోబోయారు. మంత్రి వాళ్ళనిద్దరినీ చూచి "ఆగండి" అని గద్దించాడు.

ఆస్థానవైద్యుడూ, దాదీ తెల్లబోయారు. "వీళ్ళనిద్దరినీ వేరువేరుగా బంధించి

వుంచండి" అని భటులకు ఆజ్ఞాపించాడు. భటులు వాళ్ళని తీసుకుపోయారు.

తక్షణమే మంత్రి, రాణి శయ్యాగారం తాళంవేయించి, దర్బారు చేరుకున్నాడు. మహారాజును అనేకవిధాల ఓదార్చాడు. కాని, ఎంతచెప్పినా మహారాజుకు దుఃఖం ఆగలేదు: "మంత్రీ! రాణితోనే పోయింది నాబతుకు. లేకలేక పుట్టిన బిడ్డడిని కళ్ళారా చూచుకొనకుండానే కన్నుమూసింది రాణి. దిక్కుమాలిన దేశాచారం. తలకొక పేరూ రాసుకురావడమట. ఎవడు రాసినపేరులో ఏమి అపశ్రుతి పలికిందో, బిడ్డడికి తల్లి గండం పట్టుకుంది! నారాణి చచ్చి వూరుకుంది!!

"నాబిడ్డడికి ఎవ్వరూపేరుపెట్టవద్దు. దేశాచారంకాదు, దేవునిఆజ్ఞ అయినాసరే, ఉల్లంఘించి తీరుతాను. నా బిడ్డడికి నా రాణిపేరే పెట్టండి. నారాణి దేవప్రియ. నా బిడ్డకు దేవసింహుడు. ఏమి, మంత్రీ!—నామాట పాటిస్తావా?" అని వూరుకున్నాడు.

అందుకు మంత్రి "తప్పకుండా పాటిస్తాను, మహారాజా!—దేవసింహుడు... చక్కటిపేరు. మాతల్లిని స్మరించటంకంటే మాకు కావలసిన దేమిటి? ఈ పేరుపెట్టి



పిలవటానికి లోకమంతా సంతోషిస్తుంది" అనిచెప్పి రాజును వూరడించాడు.

ఇక్కడ మంత్రీ, రాజూ మాటాడుతూ వుండగా, శక్తిసింహుడు కోటలోకి వెళ్ళాడు. వెళ్ళేసరికి వృద్ధురాలి వింతవైనం, వైద్యుడ్నీ దాదినీ అదుపులో వుంచటం, శయ్యాగారం తాళంపడటం - ఈమొదలైన సందర్భాలన్నీ తెలిసివచ్చినై. తీవ్రంగా ఆలోచించాడు. దాదిని వుంచిన తావుకు వెళ్ళాడు.

"దాదీ!—కథ అడ్డంతిరిగింది. తలచిన ఉద్దేశాలన్నీ తారుమారయినై. నిన్ను పెద్దలు విచారణ చేయువచ్చు. నీవు దోషివని వారు తీర్మానించవచ్చు. నీకు మరణశిక్ష విధించ



వచ్చు. భయపడకు. నీప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తా, నిజంమాత్రం వెల్లడించకు" అని ధైర్యం చెప్పాడు.

రాణికి ఉత్తరక్రియలు జరిగిపోయినై.

తర్వాత మరిరెండు రోజులకు మంత్రి ఆస్థానవైద్యుడినీ, దాదినీ దర్బారుకు రప్పించాడు. విచారణ చూడవచ్చినజనంతో దర్బారు కిటకిట లాడుతున్నది. మొట్ట మొదట మంత్రి ఆస్థానవైద్యుడిని విచారించాడు: అందుకు ఆస్థానవైద్యుడు—

"మంత్రిపుంగవా! కన్నతల్లివంటి దేవప్రియ విషయంలో యిలా జరిగిందంటే, చాలా విడ్డూరంగావున్నది. మీకంటే ఎక్కువగాశోకిస్తున్నానునేను. మీకంటె ఎక్కువగా ఆశ్చర్యపడుతున్నాను. కాని యిందులో ఏదో మోసం జరిగింది. ఇది ముమ్మాటికీ నిజం. దేవి మరణానికి, లోకానికి జవాబు చెప్ప వలసిన బాధ్యత మీకంటే నాకే ఎక్కువ. కనుక నిజం తెలుసుకోటానికి నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను. ఇందుకుగాను ముందుగా మనం, ఒక్కపర్యాయం రాణి వారి శయ్యాగృహం పరిశీలించిరావటం అవసరం" అన్నాడు.

అదేప్రకారం వైద్యుడిని వెంటబెట్టుకొని మంత్రి, రాణిశయ్యాగృహం చేరుకున్నాడు. అప్పుడు వైద్యుడు అక్కడ బల్లమీదవున్న వస్తువులన్నీ ఒక్కొక్కటిగా పరిశీలించాడు. బల్లమీదనున్న పాలలోటా పడిపోయి పాలు ఒలికిపోయినై. అంతకుమినహా, మరొక ఆచూకీ ఏమీచిక్కిందికాదు. నిస్పృహచెంది బయటికి వస్తుండగా, వైద్యుడి దృష్టి అప్రయత్నంగా గదిలో ఒకమూలని పడివున్న ఒకవస్తువుపైన పడింది. దగ్గిరికివెళ్ళి చూడగా అది ఒక చచ్చిపడివున్న పిల్లి.

ఇది కంటపడగానే మంత్రీ, వైద్యుడూ ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. అప్పుడు వైద్యుడు ఒలికిపోయివున్న పాల



వంక చూపుతూ, "ఈ పాలు విషపూరిత మైనవని తోస్తుంది. నేను యిచ్చిన మందు ఆ పాలల్లో కలిపిపుచ్చుకొని వుంటుంది రాణి. ఐతే, పాలల్లో విషం ఎలా కలిసిందో! అది నిలకడమీదనే తెలియాలి" అన్నాడు.

"నిలకడమీద ఎలాగా తెలిసిపోతుందను కోండి. అయితే, బిడ్డడికిచ్చే పాలల్లో విషం కలిసిందీ అంటే, అది ఎలాజరిగిందో దాదికి తెలిసివుండాలి. కనుక మనం యిప్పుడే ఆమెనీ విచారించువాం" అంటూ వైద్యుడితోసహా మంత్రి దర్బారు చేరుకొన్నాడు. దాదిని విచారించాడు మంత్రి.

దాది: "స్వామీ!—ఆ లోటాలోఉన్నవి బిడ్డడిపాలు. నేనే అక్కడ పెట్టాను. పాలు పట్టుదామనుకునేటంతలో ఒక వృద్ధురాలు వచ్చింది. నన్ను బెదిరించింది. నేను హడిలిపోయి, ఈ మాట చెప్పటానికే ప్రభువుల వారివద్దకు పరుగెత్తుకువచ్చాను. అంతలోనే గంటలు వినబడినై. గంటలు కొట్టినదీ ఆ వృద్ధురాలేనని గంటలవాడు చెప్పనే చెప్పాడుకదా! ఆ దుర్మార్గురాలే పాలలో విషం కలిపివుంటుంది. ఇంకా నయం. కొంచెంసేపుంటే, తెలియక ఈ పాలు బిడ్డడికికూడా పట్టివుందును. బిడ్డడి ప్రాణానికి కూడా మోసం వచ్చివుండేది. ఈ బిడ్డడు ఎంతో అదృష్టవంతుడు. అందుకనే దేవుడు కాపాడాడు" అని చెప్పింది.

"ఎవరీ వృద్ధురాలు?—ఆమెది యే వూరు? ఏదేశం? ఆమెకు ఇక్కడ ఏమి పని? అసలు ఈ లోపలికి ఎలా ప్రవేశించింది? పాలలో విషం కలపడమేమిటి? ఎవరూ లేకుండాచూచి మరణగంటలు కొట్టడమేమిటి? ఇన్ని దుండగాలూచేసి పట్టుబడకుండా మాయం కావడమేమిటి?" ఈప్రశ్నలకు జవాబుతెలియక మంత్రీ, వైద్యుడూ ఆలోచనలో పడ్డారు. తక్కిన వాళ్లంతా తెల్లబోయి కూర్చున్నారు.



అప్పుడు మంత్రి భటులతో "ఆ వృద్ధు రాలు మానవాతీతమయినదిగా కనబడు తున్నది. ఆమెకు ఈ కోటతో గట్టి సంబంధ మున్నట్టు తోస్తున్నది. నిజానిజాలు తెలిసే వరకూ ఏమనుకోటానికీ వీలులేకుండా వున్నది. ఆమె రాకపోదు. మళ్ళీ కోటలోకి వస్తుంది. కనిపెట్టివుండండి" అని హెచ్చ రికచేశాడు. ఆ వృద్ధురాలు వచ్చేవరకూ దాదినీ, వైద్యుణ్ణీ అదుపులో వుంచమన్నాడు.

* * * *

రోజులూ, నెలలూ గడిచిపోతున్నై. రాజ భటులు యావన్మందీ మరొక వ్యాపకం లేకుండా వెయ్యికళ్లతో కనిపెట్టుకుని చూస్తు న్నారు—వృద్ధురాలు తిరిగి ఎప్పుడు కంట బడుతుందా, ఎప్పుడు చీల్చిచెండాడుదామా అని. కాని ఎంతకూ వృద్ధురాలి జాడ ఏమీ తెలియరాలేదు. అందరూ నిస్పృహచెందారు. ఇక రాజుసంగతి చెప్పనే అక్కర్లేదు. రాణీ పోవటంతోటే మనః స్తిమితం తప్పింది. మంత్రీ, బావమరిదీ ఎంత ధైర్యం చెప్పినా ఫలితం ఏమీ కనుపించలేదు. క్రమంగా, ఆరోగ్యంకూడా క్షీణించసాగింది.

రాజు బావమరిదిని పిలిచి, పిల్లాజెల్లాతో సహా వచ్చి కోటలోనే వుండిపొమ్మన్నాడు.

శక్తిసింహుడికిమాత్రం అంతకంటే కావలసిం దేమున్నది? మరునాడే కుటుంబంతోవచ్చి రాజభవనంలో ప్రవేశించాడు.

శక్తిసింహుడే రాజ్యభారం వహించాడు. ఇక యువరాజు—నామకరణంనాడు దాది చేతులలోంచి జారిపడ్డ క్షణమే మొదలు, పసివాని ఆరోగ్యంచెడింది. కళకళలాడే ఆ ముఖంలోని చిరునవ్వు ఆనాటితోనే అంత రించింది. అంతకంటేఘోరం! ఒక్కొకరోజు పైబడినకొద్దీ శరీరమంతా పెరుగుతూవున్నా, కాళ్ళు మాత్రం సన్నబడటం మొదలుపెట్టి, దాదాపు చీపురుపుల్లలుగా తయారయినై. ఆ కాళ్ళల్లో వీసమెత్తు సత్తువలేకుండా

పోయింది. కాళ్ళు వుండీకూడా కుంటివాడే అయాడుపాపం. అయితే ఈసంగతి రాజు దాకా పోనేలేదు. రాజే కాదు, ఇప్పుడు యువరాజుని పెంచుతున్న దాదికితప్ప మరొకమనిషికి ఈ గుట్టు తెలియకుండా శక్తిసింహుడు కట్టుదిట్టం చేశాడు. ఎంతో జాగ్రత్తగా మసలుకొంటూ రోజుకొకటి రెండు పర్యాయములు మాత్రం పొత్తిళ్ల గుడ్డలతో యువరాజుని తీసుకువెళ్లి రాజుకి చూపుతుండమని దాదికి హెచ్చరిక చేశాడు.



చిన్నవాడిని చూచినప్పుడల్లా రాజు "నాతండ్రి చిరునవ్వు నారాజీతోటే మాయమైంది. పాపం, పసికూన. ఎలా పెంచుతారో!" అని నిట్టూర్చేవాడు. యువరాజు ముఖం కళావిహీనంగా వుండటానికి కారణం కొంతవరకు తల్లిలేని లోపమే అయినా, అంతకంటే ముఖ్యం ఆరోగ్యం చెడిపోవడమే అని పాపం రాజుకేంతెలుసు?

* * *

మూడేండ్లు గడిచినై. దేవసింహుడు ఈపాటికి నడకనేర్చి వుండాలికదా ? ఐనా, దాది చిన్నప్పటి లాగనే ఇంకా బిడ్డకు గుడ్డలుకప్పి ఎత్తుకువచ్చి చూపుతున్నది. ఇదిచూచి రాజు "జాగ్రత్తగా పెంచమంటే మరీ అంత చంకదిగకుండా చెయ్యమనా ? అదీ అంత మంచిదికాదు. నడవవలసిన వయస్సులో నడవనివ్వాలి. ఏదీ ఒక్కమారు దించు. నాతండ్రి తప్పటడుగులు వేస్తూవుంటే కళ్లారా చూస్తాను" అన్నాడు.

ఏమిచెప్పాలో తోచక, దాది దిక్కులు చూడసాగింది. సరిగా అదేసమయంలో శక్తిసింహుడు అక్కడే వుండటం సంభవించింది. దాది పడుతున్న అవస్థ గ్రహించాడు. ఆమె జవాబు చెప్పేటంతలో తనే కలగజేసికొని "క్షమించాలి. మీతో ఒక మనవి చేద్దామని చాలకాలంగా అనుకుంటున్నాను. అయితే,

అదేమంత పెద్ద విషయంకాదు కనుక, పని గట్టుకొని చెప్పలేదు. మరొకలాగ..."అని ఆగాడు.

"చెప్పవేయ్ బావా! నాదగ్గిర సందేహ మెందుకు?" అన్నాడు రాజు.

"మరేమీలేదు. మన చిరంజీవిసంగతే. పుట్టినది మొదలుకొని చూస్తున్నాను. బిడ్డడి కాళ్ళు అంత బలంగా కనుపించటంలేదు. తక్కిన అవయువాలన్నీ చక్కగా పెరుగు తున్నవికాని, కాళ్లలోమాత్రం ఏదో లోపం కనిపిస్తున్నది. ఇందుకు అసలు కారణం ఏమైవుంటుందా అని తెలుసుకోవటానికి యెంతో ప్రయత్నించాను. కాని ఏమీ బోధపడిందికాదు. అందుకనే బహుశా దాది బిడ్డడిని క్రిందకు దింపకపోవడం" అని ఎంతో నమ్రతగా మనవిచేసుకున్నాడు శక్తిసింహుడు.

రాజు తెల్లబోయాడు. కోపంకూడా వచ్చింది. "ఇంతకాలంగా ఈ విషయం నాకు తెలియజెయ్యకపోవటానికి కారణం? ఏదీ, బిడ్డడిని ఇలా యివ్వు" అంటూ దాది చేతిలో బిడ్డడిని అందుకున్నాడు. కాళ్లపైనున్న గుడ్డలు తొలగించి ఒక్క చూపు చూశాడు. కృశించిపోయి, ఎముక అయినా వున్నదా లేదా అనే నీరసస్థితిలో వున్న ఆ కాళ్లనుచూచి రాజు కొయ్యబారి పోయాడు. కొద్దిసేపటికి తెప్పరిల్లుకుని, "దారుణం!-తక్షణమే ఘనవైద్యులని రప్పించండి. పొండి" అని బొబ్బలుపెట్టాడు.

రాజ్యంలోని ఘనవైద్యులంతా వచ్చారు. అన్నిరకాల చికిత్సలూ చేశారు. కాని, ఫలితం కనుపించలేదు.

రాణీ ఎడబాటుతోనే కృంగి కృశించి పోయాడురాజు. తలవనితలంపుగా వచ్చిన ఈ అవాంతరంతో పూర్తిగా మంచంపట్టాడు.

కాలం సమీపించిందని గుర్తించు కొన్నాడు. తనూ పోతే మరి యువరాజుకి దిక్కెవరు? [ఇంకా వుంది]






## 3

'తనూ పోతే మరి, యువరాజుకి దిక్కెవరూ?'—ఈ సమస్యతో కృపాసింహుని మనసు వేగిపోయింది. వేగిపోవడమేమిటి! బెంగతో మరి కొద్దిరోజులకే రాణిని చేరుకొన్నాడు!! తండ్రికూడా గతించటంతో ఇప్పుడు పాపం, దేవసింహుడు కేవలమూ దిక్కులేని పక్షి ఐపోయినాడు.

'పసివాడు సొట్టవాడు. తల్లిలేదు. తండ్రిలేడు. ఈ నిసుగును ఆదుకొనేవారెవరు?'—రాజ్యంలో ఎవరినోట విన్నా ఇదే మాట. ఇదే ఆలాపన. 'రాజకుమారుని గతి ఏమిటి కాబోతుందా' అని ప్రతివాని హృదయమూ తల్లడిల్లిపోసాగింది.

రాజ్యమంతా ఈ విధంగా అట్టుడికిపోతూవున్న సమయంలో ప్రజల తాపాన్ని అణచగల ఒక చిన్న సంఘటన జరిగింది. బావమరది మృతికి అపారమైన దుఃఖంతో కుమిలిపోతూవున్న శక్తిసింహుడు కొంచెం తెప్పరిల్లి, ముఖ్యులనందరినీ దర్బారుకు రప్పించాడు. తీరని సంతాపంతో అందరి యెదటా ఇలా విన్నవించాడు :

"అయ్యా!—ఈ రాజ్యాన్ని దిగ్విజయంగా నడిపిస్తూవచ్చిన సమర్థులు మీరు. మీ సలహాలవల్లనే మా బావమరిది మన రాజ్యాన్ని రామరాజ్యంగా పరిపాలించగలిగాడు. ప్రజలందరనూ సుఖవంతులను చేయగలిగాడు. అటువంటి నా బావమరదిని బ్రతికించుకోలేకపోయిన దురదృష్టవంతుడను నేను. ఆకస్మికంగా అక్క దివికేగి నన్ను శోకంలో ముంచివేసింది. ఆ కంటితడి



ఆరకుండానే, అయ్యో!—నా బావమరది నన్ను దగాచేసి విడనాడిపోయాడు!!— ఇలా దెబ్బమీద దెబ్బ తగిలినందుకు నే నేనాడో చచ్చిపోయి ఉండవలసింది. కాని, ఈ దురదృష్టవంతుడు—అభాగ్యుడు— ఇంకా జీవించి వున్నాడంటే ఎందుకో మీరే ఊహించుకోగలరు...ఇదిగో! ఈ పసివాడి కోసం! అంగవికలుడైన ఈ నిసుగుకోసం!!- అక్కా బావా, ఇద్దరూ కలిసి ఈ చిన్న వాడిని నా చేతులలో పెట్టిపోయారు. వీడిని ఏమిచేయటమో తోచక, ఇంకా బ్రతికి వున్నాను. వీడిని ఎలా కాపాడటం? బుద్ధి మంతులైన మీరంతా బాగా యోచించి ఏదో యొకటి నిశ్చయించి చెబితే, వీడిని మీకు వప్పగించివేసి, నా దారి నేను చూచు కొంటాను. తలుచుకున్నంత మాత్రంచేతనే ఈ పసివాని చరిత్ర గుండె పగలకొడు తున్నది. నిరంతరమూ చూస్తూ యెలా ఉండగలను!' అంటూ సభవారికి ప్రశ్న వేశాడు. వేసి ఊరకున్నాడు.

శక్తిసింహుని వాక్కులకు అందరూ దిగ్భ్రమచెందారు. ఒకరి మొగాలొకరు చూచుకొన్నారు. అప్పుడు ముఖ్యులలో ఒక ముసలి ఉద్యోగి సాహసించి లేచి, "రాజా!- మాకు పట్టుకొన్న విచారాన్ని నోటిమాటలతో వెల్లడించలేము. కన్నతండ్రివంటి కృపా సింహుడు తరలిపోయినా, ఈ నిసుగు ఉన్నాడని సంబరపడదామంటే వీలుగాక పోయె! ఇటువంటి పరిస్థితులలో నీవున్నూ విరక్తి చెందితే కుర్రవాని గతి యేంకాను? ప్రజల గతి యేమికాను? ఏవిధంగా చూచినా రాజుతరువాత రాజంతటివాడివి. నీకంటె కుర్రవాడికి పోషకులెవరు? నీవే పోషించాలి. మా మనవి మన్నించు, విరక్తి భావం విడిచిపెట్టు, బిడ్డడిని గద్దెయెక్కించి నీవు పాలించు. ఇలా చేయడంవల్ల అటు రాజు ఆత్మకూ శాంతి చేకూరుతుంది, ఇటు

రాజ్యంలోనూ శాంతి నెలకొంటుంది' అంటూ ప్రాథేయపూర్వకంగా వేడుకొన్నాడు.

దర్బారులో తక్కిన అందరూ ఒక్క మారుగా లేచి, ఏకకంఠంతో "రాజా!— ఆయన చెప్పింది చాలా బాగున్నది. రాజకుమారునిపేర నీవు పాలించటమే మా అందరకూ సమ్మతం" అన్నారు.

అందరి అభీష్టాన్ని తలదాల్చి శక్తి సింహుడు రాజ్యభారం వహించి, పరిపాలన సాగిస్తూవున్నాడు. అతని పరిపాలన జన సమ్మతంగానే ఉంటూవచ్చింది. ప్రతి విషయంలోనూ మంత్రి సామంతులనూ, ముఖ్య ఉద్యోగులనూ సలహాపొంది మరీ ఏపనైనా చేసేవాడు. స్వతంత్రించి ఏదీ చేయక, తను నిమిత్తమాత్రుడుగా మాత్రమే పాలనసాగిస్తూ ఉండేవాడు. ఈ కారణంచేతనే అందరకూ శక్తిసింహుని పైన నమ్మకం కుదిరింది. అతను ఏదైనా పసివాని క్షేమంకోసమే చేస్తున్నాడనే విశ్వాసం బలపడింది.

రాజ్యభారం వహించాడేకాని, శక్తి సింహుని మనసులో ఆ వృద్ధురాలిని గురించిన ఆందోళన తొలగనేలేదు. ఎందుచేతనంటే ఏరోజునైతే రాజ్యభారం వహించాడో




ఆరోజేమొదలు శక్తిసింహుడు కంటినిండా నిద్రపోయి ఎరుగడు. ఎడతెగకుండా పీడ కలలు వస్తుండేవి. ఒక్కొక్కప్పుడు కలలో ఆ వృద్ధురాలు, భయంకరరూపంతో కను పించి హడలగొట్టేది. ఇలా జరుగుతుండటం వల్ల త్వరలోనే ఆ వృద్ధురాలు వస్తుందనీ, తన బండారం బయటపెడుతుందనీ శక్తి సింహుడు భయపడిపోయాడు.

అయితే—అతడు భయపడినట్టుగా ఆ వృద్ధురాలు మళ్ళీ ఆ చాయలకు రానూ లేదు, యదార్థం బయటపడనూ లేదు. కాని శక్తిసింహుడు ఉపాయంకోసం అస్తమానమూ ఆలోచిస్తూనేవున్నాడు.



ఇలా ఆలోచించగా ఆలోచించగా, ఒక నాడు శక్తిసింహునికి ఒక గొప్ప యోచన తట్టింది. వెంటనే ముఖ్యులను సమావేశ పరిచాడు. "బుద్ధిమంతులైన మీకు ఒక అవసర విషయం విన్నవించుకోవలసి వున్నది. మన రాజ్యానికి ఈశాన్యదిశను సుమారు పదియోజనాల దూరంలో ఒక పర్వతగుహ ఉన్నదట. ఆ గుహలో ఒకానొక యోగిపుంగవుడు ఉంటున్నాడట. ఐతే అక్కడికి వెళ్లటం ఒక కష్టం. వెళ్ళినా ఆయన దర్శనం లభించటమూ దుర్లభమే. కాని, ఆ మహానుభావుని దృష్టి పడిందా, ఎటువంటి వ్యాధిఅయినా ఆ సమీపంలో ఉండటానికే వీలులేదట. మీరు అనుమతించినట్టయితే, మన చిరంజీవిని అక్కడికొక్కసారి పంపిద్దామని నాకున్నది. ఏమిటి మీ వుద్దేశం?" అని ప్రశ్నించాడు.

అందుకు ముఖ్యులందరూ ఏకకంఠంతో 'రాజా!—ఇవాళ ఎంత మంచివార్త విన్నాము. మన చిరంజీవికి స్వస్థత చేకూరడమే మనందరకూ కావాలిసింది!! నేడే ఆ మహానుభావుడివద్దకు పంపండి' అని అంగీకారం తెలిపారు.

ఈ అంగీకారం పుచ్చుకొని, శక్తిసింహుడు కాపలావాళ్లనూ, దాదినీ తోడిచ్చి, కొండగుహకు ప్రయాణంకట్టి పంపించాడు. బయల్దేరేటప్పుడు కాపలావాళ్లకు ఏవో రహస్యసంజ్ఞలు చేశాడు.

దేవసింహుణ్ణి తీసుకొని దాదీ, కాపలావాళ్లూ కొద్దిరోజులకల్లా ఒక కీకారణ్యం చేరుకున్నారు. అలసిపోయి వుండటంచేత అందరూ కలిసి ఒక చెట్టునీడని విశ్రమించారు. దాది అక్కడనే పక్కపరిచి, బిడ్డను పడుకోబెట్టింది. తనూ కాస్తంత ఒరిగేసరికల్లా గాఢనిద్ర పట్టేసింది. అలానే కాపలావాళ్లుకూడా తమకు తెలియకుండానే గుర్రుపెట్టేశారు.




ఈ విధంగా నిద్రలో మునిగిన వాళ్లందరకూ తెల్లవారగానే మెలకువ వచ్చింది. అందరూ కలిసి దాదిని లేపారు. దాది బిడ్డడిని లేపుదామనుకొన్నది. కాని, పసివాడు కన్నులు మూసేవుండటంచేత అప్పుడే లేపడమెందుకని ఊరకున్నది. కాని, ప్రొద్దెక్కినా లేవకపోయె! తట్టి లేపింది దాది. బిడ్డడు ఉలుకూ పలుకూ లేదు !! కంగారుతో అందరనూ కేకవేసిం దామె. అందరూ వచ్చారు, చూచారు. కొయ్యలైపోయారు !!!

పడుకొన్నవాడు పడుకొన్నట్టుగానే ఉండిపోయాడు పసివాడు!!!—శ్వాస ఆడనేలేదు. ఏమిటీ చిత్రం !!—ఒక్కళ్లకూ ఏమీ పాలుపోలేదు. అంతు చిక్కలేదు. గోలుగోలున విలపిస్తూ వాళ్లందరూ తిరిగివచ్చి రాజు పాదాలపైన పడ్డారు. రాజుకూ ఆశ్చర్యమైంది. క్షణంలో మెరిసిపోయిందీ వార్త!

ఈ విధివైపరీత్యానికి రాజ్యంలో ప్రజలందరూ నివ్వెరపోయారు. ఏమీ నిశ్చయించుకోలేకపోయారు, తలకొక విధంగా అనుకొనసాగారు. రాజ్యానికే పీడపట్టుకొన్నదన్నారు కొందరు. ఏమోగాని ఇది వంశక్షయానికే వచ్చినట్టుందన్నారు మరికొందరు. అనాథరాజ్యం పేరు నిలిచిపోవలిసిందేకాబోలు నన్నారు ఇంకాకొందరు.

పసివాని మరణానికి శక్తిసింహుడు వెల్లడించిన వగపు ఇంతింత కాదు. అతని దుఃఖం చూచిన ఎవ్వరూ ఈ విషయంలో ఏదైనా కుట్ర జరిగివుంటుందా అని అనుమానపడటానికైనా ఎంతమాత్రమూ సావకాశం లేకపోయింది.

ఐతే - పసివాని మరణం రాజ్యంలో అందరికంటె ఎక్కువగా శక్తిసింహుణ్ణే ఆశ్చర్యంలో ముంచివేసింది. లాంఛనప్రాయంగా ఆయన దుఃఖం వెల్లడించాడే కాని, ఇంతసులువుగా తన చిరవాంఛితం




నెరవేరటం ఒక అతీతమైన మహిమగా కనుపించింది. తనలో తనుఎంతో ఉప్పొంగిపోయాడు. ఏ పసివాడు వదిలిపోతే తను ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యాన్ని ఏలుకొని సుఖించవచ్చునని తపించిపోయాడో, ఆ నిసుగు కాస్తా రాలిపోయాడంటే, అంతకంటె కావలిసిందేమున్నది?

ఇక తను యిష్టారాజ్యంగా ఉండవచ్చునను కుని అతడు కులికేటంతలో తలవని తలంపుగా కొన్ని విడ్డూరాలు జరిగినై. తనకు బదులుగా గద్దె యెక్కించి పట్టాభిషేకం చేదామని అనుకొన్న తన పెద్దకొడుకు అకస్మికంగా ఒక అవాంతరానికి గురి అయాడు. ఇక రేపు పట్టాభిషేకం అనగా ఆ కుర్రవాడు దురదృష్టవశాత్తు మేడమెట్లమీద నుంచి జారి పడి, బలమైన దెబ్బతగిలి కుంటివాడయాడు. ఇది జరిగి, నెల తిరగకుండా, తల్లికి ముద్దుబిడ్డడైన కనిష్ఠుడు, అరవవాడు పెద్ద జబ్బుచేసి, చచ్చిబ్రతికినంత పనయింది. ఈ రెండుదెబ్బలూ తట్టుకొనేటంతలో, అల్లుడు మతిచెడి దేశాంతరం పోవటంతో ఒక్కగానొక్క కూతురి కాపరం మంటగలిసింది. ఈ విధంగా ఎవరో ఒకరు ఏదో ఒక ఆపదలో చిక్కుకుంటూనే వున్నారు కాని, కుటుంబంలో ఒక్కళ్ళూ సుఖపడి యెరుగరు.

శక్తిసింహుడు గుండెనిబ్బరం కలవాడే. ఐనా, తన కళ్లయెదట తన కుటుంబం ఇలా కష్టాలపాలవుతున్నదంటే, సహించలేకపోయాడు. ఎన్ని చికిత్సలు చేయించినా బిడ్డలు దారికి రాలేదు. బాలారిష్టాలు తొలగేటందుకు ఎన్నో శాంతులు చేయించాడు. కాని, అతని మనస్సుకు శాంతి చేకూరలేదు. మంచికాలం వచ్చిందని సంబరపడేటంతలో కథ ఇలా అడ్డంతిరిగిందే!

అతని మనసు వికలమైపోయింది. 'తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తా'డనే

పెద్దల వాక్యం నెమరుకు తెచ్చుకొన్నాడు. రాజ్యంలో పేరొందిన జ్యోతిష్కులనందరినీ పిలిపించి, 'ముందు కథ ఏమిటి?' అని ప్రశ్నిస్తూ, కుటుంబజాతకాలన్నీ వారి ముందు పడవేశాడు.

దైవజ్ఞులు ఆ జాతకాలన్నీ జాగర్తగా పరిశీలించారు. పుట్టలు పుట్టలుగా అంకెలు వేసి గుణించారు. ఎంతగా చూచినా ఆ జాతకాలన్నీ చీకటిమయంగానే కనిపించినై. కాని ఒక్క మెరుగయినా కానరాలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే ఇక కొద్ది కాలంలోనే శక్తిసింహుని కుటుంబం నామరూపాలు లేకుండాపోయేటట్టు ఆ జాతకాలలో స్పష్టంగా కనిపించింది.

అనుకూలమైన వార్త ఐతే ఒకదానికి నాలుగు కలిపి ఉత్సాహంగా చెప్పవచ్చుగాని, ఇప్పుడున్న పరిస్థితులలో ఓటిమాటలు ఎలా వెల్లడించటం? ఐనా, జాతకం ఎంత పాడుగా వుంటే అంత దివ్యంగా వున్నదని నచ్చజెప్పటం తమ విధి. జ్యోతిష్కులందరూ కూడబలుక్కొని, జాతకాలలో వుండే చెడుగంతా అనుకూలంగా మార్చి రాజుమనస్సుకు నచ్చే తీయని మాటలతో విన్నవించారు.



చెప్పి చెప్పి ఆ దైవజ్ఞులు 'మహారాజా!– త్వరలోనే ఏల్నాటిశని వదిలిపోబోతున్నాడు. వెంటనే ఏలికకు ఒక గొప్ప మహాయోగం పట్టబోతున్నది. దేవర మనసులో తలిచిన కార్యాలేగాక, తలవని కార్యాలుకూడ మరెన్నో జయప్రదంకాబోతున్నవి. గ్రహకూటం చాలా అనుకూలంగా వుంటుంది. నిజానికి ఇటువంటి జాతకం ఇంతవరకు మేమెక్కడా చూచిఉండలేదు...' అంటూ పొగడనారంభించేసరికి, శక్తిసింహుడు ఉబ్బి తబ్బిబ్బులై ఆ జ్యోతిష్కులకు గొప్ప గొప్ప బహుమానాలిచ్చి సత్కరించి పంపాడు. వారు చెప్పిన ఆ మహాయోగం

ఎప్పుడు పడుతుందా అని ఎదురుచూస్తూ వున్నాడు.

ఇన్ని చిత్రాలు జరుగుతున్నా, యిదంతా విధివిలాసమే అని మంత్రి నమ్మలేక పోయాడు. ఇందులో మాయ జరిగివుంటుం దనే సందేహం అతడిని పీడిస్తూనేవున్నది. కాని, ఆధారంలేకుండా ఎలా కలగజేసు కోవటం? పైగా రాజబంధువు అయిన శక్తి సింహుడి విషయంలో అనుమానపడటం కోరి ముప్పుతెచ్చుకొన్నట్టే అవుతుంది.

రాజ్యంలో ప్రజలూ, ప్రజలనుపాలించే ముఖ్యులూ శక్తిసింహుని మాటలను పూర్తిగా నమ్మి, శిరసావహిస్తున్నారాయె. అటువంటప్పుడు 'అది కాదయ్యా ఇది' అని మంత్రి ఒక్కడూ చెబితేమాత్రం ఎవ ళ్ళకు చెవికెక్కుతుంది? కాబట్టి, మాయ బయల్పెట్టి రుజువుచేసి చూపించగల ఆధారం తనకు దొరికేవరకూ పలకకుండా ఉండటంతప్ప గత్యంతరంలేదు.

ఆ వృద్ధురాలెవరోగాని, ఈ సమయంలో ఆమె అయినా వస్తే బాగుండిపోను. కాని, ఆమె రాలేదు. ఆమె వచ్చేవరకూ దాదినీ ఆస్థానవైద్యుడినీ—వాళ్ళు దోషులవునా కాదా అనే సంగతి అటుంచి — కారా గారంలో వుంచే తీరాలె. వేరేమార్గం లేదు.

తనకు శనిరోజులు వదిలిపోయి మంచి కాలం ఎప్పుడు వస్తుందా అని ఒకవంక శక్తిసింహుడు ఎదురుచూస్తున్నాడు. మరొక వంక మంత్రి, ఆ వృద్ధురాలు ఎప్పుడు వస్తుందా, ఎప్పుడు నిజం వెల్లడి అయి తన నమ్మిక బలపడుతుందా అని ఆరాటపడు తున్నాడు.

ఈ ఆరాటంతో మంత్రి ఆ వృద్ధురాలి జాడ ఎలాఅయినాసరే తెలుసుకురమ్మని నమ్మినబంట్లను రాజ్యం నలుమూలలకూ పంపాడు. మంత్రి ఆజ్ఞప్రకారం వాళ్లందరూ గట్టి పట్టుదలతో రాజ్యమంతా గాలింప జొచ్చారు. —(ఇంకా వుంది)






## 4

మంత్రి ఆజ్ఞప్రకారం, బంటులందరూ వృద్ధురాలికోసం రాజ్యమంతటా గాలింప జొచ్చారనికదా చెప్పాము! వారాలూ నెలలూ గడిచిపోతున్నై. వెళ్ళినవాళ్ళలో ఒక్కళ్ళూ తిరిగిరావటం కనబడలేదు. వాళ్లకోసమని ఆత్రంతో ఎదురుచూస్తూవున్న మంత్రికి రోజొక యుగంగా తోస్తున్నది.

అయితే—వృద్ధురాలు రానీ, పోనీ, ఆమెనుగురించిన విషయమొక్కటే ముఖ్యం కాదు, మంత్రికి. రాత్రింబవళ్ళు అతని దృష్టిని ఆకర్షిస్తూవున్న విషయాలు ఇంకా అనేకంవున్నై. అవతల పసివాని మరణంలో గల మర్మం యేమిటో కనిపెట్టాలె. ఇవతల రాణి మరణానికిగల కారణాలేమిటో కని పెట్టాలె. ఈ విధంగా తను కోరి భుజ స్కంధాలపైన పెట్టుకొన్న బాధ్యతలు మిక్కుటమైనవీ అపారమైనవిన్నీ.

ఆటువంటప్పుడు మంత్రికి నిద్రపట్టక పోవటంలోనూ, తిండి నోటికి పోకపోవటం లోనూ ఆశ్చర్య మేమున్నది? ఏక్షణాన ఏమివార్త వింటామా అని అతడు చెవులు రిక్కించుకొనివున్నాడు. ఎప్పుడు తనభటులు వస్తారా అని కన్నులు రెప్పవాల్పక చూస్తూ వున్నాడు. ఇక, అతని బుద్ధి, విశ్రాంతి యెరగక ఎన్నివిధాల యెంత చురుకుగా పనిచేస్తున్నదో నోటిమాటలతో చెప్పటానికి వలనుకాదు.

ఇటువంటి మనోవేదనతో మంత్రి, ఉన్నట్టేవుండి ఒకనాటిరాత్రి ఒంటిపాటుగా వైద్యుడు బంధింపబడిన గదికి వెళ్లాడు.



తలిదండ్రులుగా ఎంచుకొన్నటువంటి దేవ ప్రియ, కృపాసింహులు మరణించటంతో ఆస్థాన వైద్యుడు మానసికంగా కృంగి పోయాడు. పైగా ఇప్పుడు, తలవనితలం పుగా తనపై వచ్చిపడిన అపనిందతో ఘరా నాగా బ్రతుకుతూవచ్చిన ఆస్థాన వైద్యుడు కేవలమూ జీవచ్ఛవమే ఐపోయాడు.

ఈస్థితిలోవున్న వైద్యుణ్ణి ఏమని పలక రించటం? మంత్రికి ఏమీ మనస్కరించింది కాదు. నిజానికి—వైద్యుని మనసు ఏమైనా మారిందేమో కనిపెట్టుదామనీ, ఆయనవల్ల ఏమైనా కొత్తభోగట్టాలు తెలుస్తాయేమో తెలుసుకుందామనీ అనుకొన్నాడు మంత్రి.

కాని, మంత్రి కంటపడటంతోనే వైద్యుడు రాజునూ రాణినీ జ్ఞాపకంచేసుకుని వలవల యేడ్చాడు. అప్పుడు మంత్రి ఆయనను ఊరడించవలసి వచ్చింది. ఇంతటితో వైద్యుడు నిర్దోషి అని మరిఒకసారి మంత్రికి రూఢి ఐపోయింది.

అక్కడినుండి అతడు దాదిని బంధిం చిన గదికి వెళ్లాడు.

రాత్రివేళ ఒంటిపాటుగావచ్చిన మంత్రిని చూస్తూనే ఆమె బిత్తరపోయింది. ఐనా, అంతలోనే తమాయించుకొని, నిబ్బర పడింది.

"దాదీ! మన రాజవంశం యెంతలో ఎలా ఐపోయిందో చూచావా!" అంటూ సానుభూతిచూపాడు మంత్రి. 'విషపూరిత మైన పాలు కళ్లయెదట స్పష్టంగా కన బడుతూవుండగా రాణి మరణం కేవలమూ దైవమాయ అని ఎవరు నమ్ముతారు?' అని, మొదటినించీ తనకుపట్టుకొన్న సంశయం వెలిబుచ్చాడు. ఆమెకూ ఆస్థానవైద్యుడికీ ఈవిషయంలో వుండే బాధ్యత యెంతటిదో వివరించాడు. వారిద్దరినీ అదుపులో ఉంచ వలసివచ్చిన కారణాలు విప్పిచెప్పాడు. 'కృపాసింహుని కుటుంబగౌరవం నిలపడం

మనందరకూ విధి' అంటూ అమెను రాజనీతి బోధించాడు.

చివరకు ఎన్నోవిధాల అమెను లాలిస్తూ "దాదీ!—ముక్కూ మొగమెరుగని ఆ వృద్ధురాలికి మనతో సంబంధ మేమున్నది? ఆమె వచ్చి బిడ్డపాలలో విషంకలిపిందంటే న్యాయమూర్తులు నమ్మలేకున్నారు. మీ ఉభయులమీదా అనుమానం బలీయంగా వున్నదనీ, ఒకవేళ ఉరిశిక్షకూడా విధింపబడవచ్చుననీ వదంతులు ప్రబలంగా వున్నాయి. ఈమాట చెప్పటానికే ప్రత్యేకించి పనిగట్టుకువచ్చాను. ఇప్పుడైనా దాపరికంలేకుండా నీకుతెలిసిన నిజం చెప్పితివా, ఉరిశిక్ష తప్పించగల" అని అభయమిచ్చాడు.

ఎంత ఊపిచూచినప్పటికీ దాది రవంతైనా బెసగలేదు. అతడు చెప్పేదంతా చెప్పనిచ్చి, చివరకు అమె నిదానంగా 'స్వామీ! నాకు తెలిసినదీ తోచినదీ చెప్పనే చెప్పాను. అప్పుడొకమాటా ఇప్పుడొక మాటా చెప్పేదానినికాను నేను. వృద్ధురాలు రాకుండా ఎక్కడికిపోతుంది? ఏనాటికైనా వచ్చేతీరుతుంది. రానివ్వండి. వస్తేకాని నిజానిజాలు తేలటానికేమీ సావకాశంలేదు.




అనుమానిస్తున్నారు కనక ఆమె వచ్చే వరకూ నన్ను ఇక్కడ ఇలా బంధంలోనే ఉండనీయండి. మీకూ నాకూకూడా ఇదే శ్రేయస్కరమైన మార్గం. వృద్ధురాలు వచ్చినతరువాత నా అపరాధం ఋజువైతే ఉరిశిక్షే కాదు, మరే శిక్ష విధించినా సంతోషంతో అనుభవించటానికి సిద్ధంగా వున్నాను' అని చెప్పింది.

దాది చెప్పినమాటలు ఎంతో సబబుగా, నలుగురూ హర్షించేటట్టుగా వున్నాయి. కనుక, మంత్రి మారుచెప్పటానికి అవకాశం ఏమీచిక్కలేదు. అందుకని చక్కా వచ్చేశాడు.




ఆ మరునాడే మంత్రి శక్తిసింహునివద్దకు వెళ్లి—"ప్రభూ! ఒక చిన్న విషయం మనవి చేదామని వచ్చాను. చూడండి—అక్క గారి ఆకస్మిక మరణానికి వృద్ధురాలే కారకురాలై వుంటుందని అందరమూ ఏకీభవించినా, అప్పట్లో అనుమానితులైన వైద్యుడినీ, దాదినీ నిజం వెల్లడి అయే వరకు బంధంలో వుంచటం అవసరమని అలాచేశాము. ఇప్పటికి ఆరేండ్లు గడిచినై. ఆ వృద్ధురాలు వచ్చే జాడ కనుపించలేదు. ఆఖరుప్రయత్నంగా నేను గతరాత్రి దాదినీ, వైద్యుడినీ కలుసుకున్నాను. నిజం వెల్లడించని పక్షంలో ఉరిశిక్ష విధించబోతారనికూడా బెదిరించిచూచాను. అయినప్పటికీ ఏమీ ప్రయోజనం లేకపోయింది. అంతేకాదు. వాళ్లిద్దరూ నిర్దోషులని నాకు పూర్తిగా నమ్మకం చిక్కింది. అందుచేత ఆ నిరపరాధులను యింకా బంధంలో వుంచటం న్యాయంగా తోచటంలేదు. ఈవిషయంలో దేవర అభిప్రాయం..."అని యింకా ఏమో చెప్పబోయాడు.

శక్తిసింహుడు అడ్డుతగిలి: "మంత్రీ! నేనూ ఇందునుగురించే ఆలోచిస్తున్నాను. ఇంతలో నీవూవచ్చావు. తరతరాలుగా మన ఆస్థానం కనిపెట్టుకొనిఉన్నవాడు వైద్యుడు. పాపం అమాయకుడు. ఆయనవల్ల ద్రోహం జరిగివుంటుందని నేననుకోను. పోతే, దాది—నా మేనల్లుణ్ని కడుపులో పెట్టుకు పెంచింది. ఆమెనుమాత్రం ఎలా అనుమానించటం? కనుక నీ సలహాప్రకారం వాళ్లిద్దరినీ యిప్పుడే విడుదలచేయిద్దాం" అన్నాడు.

ఈ ఆజ్ఞతీసుకుని మంత్రి సరాసరి దాదీ, వైద్యుడూ వున్నచోటికి వెళ్ళాడు. వాళ్లిద్దరినీ విడుదలచేయించివేశాడు.

దాది యెక్కడ నిజం బయటపెట్టుతుందో, ఏమికొంప మునుగుతుందో అని




యింతకాలంగా లోలోపల హడిలిపోతున్న శక్తిసింహుడు, అదృష్టవశాత్తు యిలా కలిసివచ్చేసరికి ఉప్పొంగిపోయాడు. ఇక బ్రహ్మ రుద్రాదులు కూడా తనుచేసిన మోసం గ్రహించలేరుకదా అని యెంతో స్తిమితపడ్డాడు. అయితే, కపటమైన ఈ మనస్తిమితం ఎంతకాలం నిలుస్తుంది?

సంసారంలో అతనికి అంతులేని కష్టాలు దాపరించె. వాటిని నివారించుకునేటందుకు అతడుపడ్డపాట్లు బ్రహ్మకే తెలియాలె. ఒక్కొక్క కష్టమే ఒంటపట్టటంతో అతనికి గుండెనిబ్బరం సడలిపోసాగింది. గండాలు గడిచి కష్టాలు గట్టెక్కటానికని ఎవరేమి చెబితే దానినల్లా తల ఒగ్గి చేస్తూవచ్చాడు.

కష్టాలకు లొంగిపోయిన ప్రాణి ఇలా చేయటంలో అబ్బురమేమున్నది! దేవుడూ లేడు దయ్యమూలేదు అని మొరాయించి తిరిగే శక్తిసింహుని మనస్తత్వం ఇప్పుడు అతిచిత్రంగా మారిపోయింది. కాస్త గెడ్డం పెంచుకుని కాషాయగుడ్డ కట్టి కమండలువు చేతపట్టినవాడు కనిపిస్తే చాలు, వాడిని ఆశ్రయించి తరణోపాయం సెలవీయమంటూ అదొక విధమైన పిచ్చి ధోరణిలో ప్రాధేయపడుతూ వచ్చాడు. ఏ పుట్టలో ఏపామున్నదో, ఏ మహాత్మునిలో ఏమిమహిమ వున్నదో అనే గుడ్డినమ్మకతో అతడు తోవనుపోయే సాధువుల నందరినీ పిలిచి, వారివల్ల జ్ఞానబోధలు వింటూఉండేవాడు. తన పుణ్యంకొద్దీ ఏ మహానుభావుడైనా వస్తాడా, మనశ్శాంతి కలిగిస్తాడా అని అనుక్షణమూ అలా నిరీక్షిస్తూనే ఉన్నాడు.

ఇలా తపించిపోతూవున్న శక్తిసింహుడి భవనానికి ఒకనాటి ఉదయం ఒకానొక యోగిపుంగవుడు విచ్చేశాడు. కాపలావాళ్లనైనా లెక్కపెట్టకుండా చరచరమంటూ భవనంలోకిపొబోయాడు. ఐతే కాపలావాళ్లు అడ్డుకున్నారు. కాని, అంతలోనే అదృష్ట



వశాత్తు శక్తిసింహుడు ఆ చాయలకు రాపటం తటస్థించి, అతడే స్వయంగా ఆ యోగిపుంగవుని తనతోకూడా భవనంలోనికి తీసుకుపోయాడు. ఈ యోగీశ్వరుని వేషభాషలు అసామాన్యంగా కన్పట్టినై. చూడగా, ఇంతవరకు వచ్చిన యోగీశ్వరులందరూ ఒక యెత్తు, ఇప్పుడు దర్శనమిచ్చిన ఈ మహానుభావుడు ఒక్కడూ ఒక యెత్తు అనిపించింది శక్తిసింహుడికి.

ఏమంటే, ఇంతవరకు వచ్చిపోయిన సాధువులందరూ తన జీవిత విశేషాలలో ఒక్కటైనా తప్పిపోకుండా చెప్పలేకపోయారు. కాని, ఇప్పుడీ మహానుభావుడు ఎంతటివాడో కాని, పలికిన పలుకులన్నీ ఆణిముత్యాలే! మచ్చునకైనా ఒక్క వాతప్పా కనిపించలేదు.

శక్తిసింహుడి చరిత్ర అంతా పుస్తకంలో పత్రాలు తిరగవేసినట్టు గబగబా చెప్పుకొనిపోయాడు యోగిపుంగవుడు. తన్మయుడైపోయాడు శక్తిసింహుడు. అతడి మనసులోని వాంఛలన్నీ ఏకరుపెట్టాడు యతీశ్వరుడు. కుటుంబంలో కలిగిన కష్టాలన్నిటినీ పూసగుచ్చినట్టు వెల్లడించాడు. తన జీవితంలోని ఒక్కొక్క హంశమే చెబుతూ వుంటే శక్తిసింహుడి శరీరం కంపించిపోయింది. ఇంతకాలంగా బ్రహ్మకుకూడా తెలియనీయకుండా దాచిపెట్టుకొన గలిగానని అనుకొన్న శక్తిసింహుడు, తన గుట్టుమట్టుల్ని యతీశ్వరుడు వెలిబుచ్చటంతో నిస్తబ్ధుడైపోయాడు.

ఈ యతీశ్వరుడు తన తపఃఫలంకొద్దీ ప్రత్యక్షమైన దైవంలాగా కనిపించాడు. ఈ మహానుభావుని నోటివెంట వచ్చే ఒకొక్క మాట ఒకొక్క మంత్రంలాగా వీనుల విందుగా వినిపించింది.

మరి, దేవునియెడట దాపరికమేమిటి? "మహాత్మా!—నేనుచేయని పాపములేదు.

రాజ్యకాంక్షతో నా బావమరిది కుటుంబమే నామరూపాలులేకుండా నాశనంచేసిన మహా పాపిని నేను!! నేను చేసుకొన్న మహా పాతకాలే నన్ను చుట్టుకుని, ఈ జన్మలో నే కట్టికుడుపుతున్నాయి" అంటూ సమస్త విషయాలూ మాయా మర్మం లేకుండా ఆయనతో చెప్పివేశాడు.



"మహాత్ములకు అసాధ్య మేదీలేదు. నాకు తరణోపాయం అనుగ్రహించండి. స్వామీ మనశ్శాంతి ప్రసాదించండి!" అంటూ శక్తిసింహుడు యతీశ్వరునికి పాదాక్రాంతుడై, పూర్తిగా ఆయనకు వశుడైపోయాడు.

తన దుష్టచింతలకు, దుర్నయాలకు సిగ్గుపడి తలవంచుకొన్న శక్తిసింహుణ్ణి-పశ్చాత్తాపంతో కన్నీటిధారలు రాల్చే శక్తిసింహుణ్ణి-కనికరించినట్టుగా ఒక్క దయారసమొలికే చూపు చూచాడు యతీశ్వరుడు. కొంచెంసేపు ఆలోచనలో మగ్నుడయ్యాడు. తరువాత పాపపరిహారార్థం ఆచరించవలిసిన కొన్ని కొన్ని ప్రక్రియలు సూచించాడు. ఇలాచేస్తే మేలు కలుగుతుందని చెప్పి దీవించాడు.

ఆరోజుకు ఉండిపొమ్మని శక్తిసింహుడు యెంతగానో బ్రతిమలాడాడు. కాని, యతీశ్వరుడు 'మరొకప్పుడు మళ్లీ దర్శనమిస్తాము. లోకహితంకోసం సంచారం చేయవలసిన విధి మాది. ఒక్కచోటనే ఇంతకాలం వుండటం పాడికాదు' అని చెప్పి, గెడ్డం సవరించుకొంటూ వేగిరపాటుతో లేచాడు. సంపూర్ణమైన భక్తివినయాలతో శక్తిసింహుడు ఆ మహానుభావుణ్ణి కోటద్వారంవరకు స్వయంగా సాగనంపి ఆయనవద్ద సెలవుతీసుకొన్నాడు.

తొందరగా పోతూవున్న యతీశ్వరునికి టకీమని గుమ్మం తగిలింది. తడబడ్డాడు. ఆ తడబాటులో ఆయన మొలనున్న బాకు కింద పడింది. అది పడిపోవటం గ్రహించా

డాయన. అయితే, ఒక్క క్షణమైనా జాగు చేయక ఆయన వెనుతిరిగిచూడకుండా అక్కడనుండి చరచర తనదారిని తను వెళ్ళిపోయాడు.

కిందపడిన బాకు కంటబడగానే ఫారా వాళ్ళలో ఒకడు కంపించిపోతూ కంగారుగా పోయి, దానిని శక్తిసింహునిముందు ఉంచాడు. మరొక ఫారావాడు ఆ యతీశ్వరుని వెంటబడ్డాడు.

యతీశ్వరుని కరుణవల్ల ఇక మంచి రోజులు వస్తాయికదా అని సంతోషపడుతున్న శక్తిసింహునికి బాకు కంటపడగానే మతిచలించింది. బాకు అటు యిటు తిప్పి చూచాడు. దానిమీద పేరు చూడటంతో అతని హృదయంలో అగ్నిపర్వతం పగిలినట్టయింది!! వెర్రిగా కేకలు ప్రారంభించాడు: "దొంగ - దొంగ - గజదొంగ - పట్టండి - పోండి - పట్టుకోండి-సాధువును పట్టితేండి - పోండి" అంటూ రంకెలువేస్తూ, కూర్చున్న చోటనే సోలిపోయాడు.

రాజాజ్ఞను శిరసావహించి ఆస్థానపు అశ్వికులు పంచకళ్యాణిలవంటి గుర్రాల మీద దౌడు తీసుకొంటూ పోయి సాధువును పట్టబోయారు. అన్నీ సిద్ధపరుచుకుని వచ్చినవాడు సాధువు. కనుక బాకు జారిపోవటంతోనే అంచీలమీద ఎగిరిపోయాడు!! ఐనా, శక్తిసింహుని అశ్వికులు తోడావేసికొన్న వాళ్ళు. ఎట్లా ఐనా సాధువును పట్టాలెననే పట్టుదలతో చాకచక్యమంతా వినియోగించి శక్తికొద్దీ పరుగుతీశారు. అల్లంతదూరంలో ఆ సాధువుగుర్రం రేపే ధూళి కనిపించింది. ఎలాఐనా ఆ గుర్రాన్ని కలుసుకోవాలనే గట్టి దీక్షతో వాళ్లు వాయువేగంతో సాగిపోయారు.

ఈ విధంగా సాధువు ముందూ, అశ్వికులు వెనకా, ఒకరినిమించి ఒకళ్ళు దౌడు తీయసాగారు. —(ఇంకా వుంది)






## 5

బొాకుమీద పేరు చూచిందే మొదలు, శక్తిసింహుని మనస్తత్వమే మారిపోయింది. సొలిపోయిన అతనికి తెలివిరాగానే అంద రనూ పొమ్మన్నాడు. బాకుతీశాడు. తిప్పి చూచాడు. ఆ పిడివంకా, పిడిమీది పేరు వంకా అదేపనిగా మళ్లీమళ్లీ చూడసాగాడు. చూస్తూవున్నప్పట్లో అతనివైఖరి బహు విధాలుగా మారుతూవచ్చింది.

"అరి దుర్మార్గుడా!— ఉన్నట్టేవుండి నా ప్రాణానికే తలపెట్టావా? ఎటువంటి వ్యూహం పన్నావు? ఎంత పొందికగా కపట నాటకమాడావు? ఎవళ్లదగ్గర వాళ్లమాటలు చెప్పి, ఎంత చక్కగా నమ్మించావు? కానీ—నీ పాపం బద్దలయింది. అందుకనే నీ పన్నాగం బయటపెట్టింది ఈ బాకు" అంటూ తనలో తనే ప్రసంగం ప్రారంభించాడు.

అతనికి మనస్తిమితం కుదరలేదు. ఆలోచనలకు అంతులేదు. గభీమని లేచాడు. అటునుండి యిటు, యిటునుండి అటు విసురుగా పచారులుచేయసాగాడు. "ఇంతకూ, లోపం నాదేనని అనిపిస్తున్నది. ఏమీ అంటే:—నాకు కుటుంబకష్టాలు ఎప్పుడైతే మొదలెట్టినయో అప్పటినుంచీ నేను గుడ్డిగా సాధువులను పూజించటానికి అలవాటుపడ్డాను. ప్రతివేషధారినీ నమ్మి, వాళ్లయెదట నా చరిత్ర వెల్లడిస్తూవచ్చాను. ఇదే నా కొంప ముంచింది. ఈ లోకువ కనిపెట్టే వాడు ఇంతటి దురంతానికి తల పడ్డాడు. లేకుంటే—సింహస్వప్నంకదా, నేనంటే వాడికి! నాపట్లే కుట్రచేయటానికి సాహసించాడే!" అని మళ్ళీ తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు.




ఆనాటి సంఘటన తలపునకు వస్తేసరి, దిగాలుపడుతూ "నా యింగితమంతా ఏ యేట్లోపడింది? వాడు తక్కిన సాధువులందరిలా కనిపించటంలేదన్నప్పుడైనా కానుకోలేకపోయానే! అయ్యో, వాడిని దేవుడిలాగా నమ్మి, నా హృదయమే ఇచ్చివేశానే!' అనుకొని జిజ్ఞాస చెందాడు.

అ వెంటనే మళ్ళీ ధైర్యంతెచ్చుకుని, "దేవుడు పూర్తిగా నాపట్ల ఉన్నాడనటానికి ఇంతకంటె నిదర్శనం ఏంకావాలి? వాడికి ఈ దుర్బుద్ధి పుట్టడం, అదీ ఒక మంచికే వచ్చింది. ప్రాణం దక్కిందే చాలునని వాడు పరుగుచ్చుకున్నాడు. మరి ఈ జన్మలో మళ్ళీ ముఖం చూపుతాడనటం వట్టిమాట. అందుచేత, నా పాచిక పారటానికి మరీ బాగా సావకాశం చిక్కింది" అనుకుని, ఏదో ఒక గొప్పసమస్య తీరినట్టుగా సంతోషించాడు.

మరునాడే శక్తిసింహుడు దర్బారుపెట్టి ముఖ్యులందరినీ పిలిపించాడు. 'ఒక్కసారి మనం వెనకటిరోజులు జ్ఞాపకం చేసుకోవాలి. ఇందుకోసమే మిమ్మల్ని శ్రమపెట్టి రప్పించాను. అక్కా, బావా, పసివాడూ పోవటం కేవలమూ విధివైపరీత్యమనుకుని సరిపెట్టుకున్నాము. ఒకవేళ మధ్యని వచ్చిన ఆ వృద్ధురాలు కారకురాలై వుంటుందేమోననికూడా శంకించాము. చివరకు, ఏమీచేయలేక, లోకంనోరు కట్టటానికని పాపం, మహానుభావుడైన ఈ ఆస్థాన వైద్యుణ్ణీ, లోకజ్ఞానంలేని ఈ దాదినీ అనుమానించి, బంధించి, పాపానికి ఒడిగట్టుకున్నాము, ఐతే, ఇప్పుడు నిజం బయల్పడింది. తరతరాలుగా మా రాజవంశాన్ని కనిపెట్టుకుని ఉన్నవాడూ, నమ్మిన బంటులాగా నడుచుకొంటున్నవాడూ, వాడే ఇటువంటి ఘాతుకానికి పూనుకొన్నాడు' అంటూ వుండగానే, సభలో ఉద్రేకం బయల్దేరింది.

"ఎవడా దుర్మార్గుడు? ఎవడా పయోముఖ విషకుంభం?" అని కేకలువేశారు.

"చెప్పనివ్వండి మరి. తొందరపడకండి. నిన్నను మన కోటలో జరిగిన చిత్రకథ చెప్పటానికే మిమ్మల్ని రమ్మని కోరింది. అంతా విన్నాక మీకే తెలుస్తుంది..." అంటూ, మంత్రి తనను హత్యచేయ వచ్చాడని ప్రజలు నమ్మేటట్టుగా మాయ సాధువు చరిత్ర అంతా విప్పిచెప్పాడు.



"ఆ నీచుడెవడో పేరుచెప్పండి. వాణ్ణి చీల్చి చెండాడితేగాని ఇంటికి పోయేదిలేదు" అని గగ్గోలుచేస్తూ, అందరూ శక్తిసింహుని దగ్గరగా చేరుకున్నారు. అప్పుడు శక్తి సింహుడు తనవద్దనున్న బాకుతీసి పెద్దల చేతికిచ్చాడు. దానిమీద పేరు చూచి అందరూ విస్తుపోయారు. "మంత్రికే పుట్టిందా దుర్బుద్ధి! ద్రోహి!! స్వామి ద్రోహి!!!" అంటూ జనం కారాలూ మిరియాలూ నూరారు. 'వాడిని పట్టిపల్లార్చాలి' అని కొంతమంది ఉగ్రంగా దీక్షపట్టారు. 'ఇంకా నయం, మన ప్రభువు అదృష్ట వంతుడు!' అంటూ మరికొంతమంది ఊరటచెందారు. కొందరు మంత్రిని పట్ట టానికని ఆవెంటనే బయల్దేరారు.

"సరే. వెళ్ళనివ్వండి వాళ్ళను. వాళ్ళే కాదు, మనందరమూ వెళ్లాలిసివుంటుంది. ఒక రాజద్రోహి జీవించివుండగా మనకు ఎలా నిద్రపట్టుతుంది? శత్రుశేషం ఉండ కూడదంటారు పెద్దలు. కనుక మన పరమ శత్రువునుపట్టి చిత్రవధ చేస్తేకాని మరొక పనికి పోకూడదు" అని పురెక్కించాడు, శక్తిసింహుడు.

"అంతేకాదు. ఇంతటినించీ మన రాజ్యంలో ఏ కొత్తపురుగు ప్రవేశించినా, కట్టుదిట్టంగా పరీక్షచేయాలి. పరీక్షకు నిలిస్తేగాని అడుగుపెట్టనీయకూడదు" అని శాసనంచేశాడు. మంత్రిని పట్టితెచ్చిన



వాళ్లకు మంచి మంచి బహుమతులు ఇస్తామంటూ రాజ్యమంతటా చాటింపులుకూడా వేయించాడు.

"ఇప్పుడు మరొక్క ముఖ్యవిషయం చెప్పి ఇవాళకు దర్బారు చాలిస్తాము. ఈ ఆస్థానవైద్యుడు మనందరకూ తండ్రివంటివాడు, గురుతుల్యుడు, గొప్ప అనుభవజ్ఞుడు. పైగా స్వామిభక్తిపరాయణుడు. ఇటువంటి మహానుభావుణ్ణి అనుమానించి బంధించాడు ఆ పరమ దుర్మార్గుడు! వాడిమాట కాదనటానికి అప్పట్లో నాకు తగినంతబలము లేకపోయింది. నిరపరాధులకు తీరని అపచారం జరుగుతున్నప్పటికీ చూస్తూ ఊరుకోవలసివచ్చింది. ఐతే—ఇప్పటికైనా పొరపాటు గుర్తించగలిగాము కాబట్టి, తప్పు దిద్దుకోవటానికి నాకుతోచిన ఒక సాధనం మీకు విన్నవిస్తున్నాను" అన్నాడు శక్తిసింహుడు.

ఒక్క నిమిషం ఆగి, ఆస్థానవైద్యుణ్ణి రెండుచేతులూ పట్టుకొని తీసుకొనివెళ్ళి తనస్థానంలో కూర్చోబెట్టాడు. సభవంక తిరిగి, "ఇదుగో, మీ అనుమతితో ఈక్షణం నించీ ఈయననే మన రాజ్యానికి సారథిగా చేస్తున్నాను. పరోక్షంగా ఉన్నప్పటికీ నేను మీసేవచేస్తూ నేవుంటాను" అనేసరికల్లా, శక్తిసింహుని త్యాగానికీ ఔదార్యానికీ అందరూ జేజేలుకొట్టారు.

అయితే—ఆస్థానవైద్యుడు సందిగ్ధంలో పడ్డాడు. మంత్రిని ఆయన చిన్నప్పటి నుంచీ ఎరుగును. అతడు ద్రోహం తలపెడతాడనేది నమ్మరానిమాట. ఏ పరిస్థితుల్లో అతడిలా చేసివుంటాడో సంగతీ సందర్భం తెలియందీ ఏమనుకోవటానికీ వీలులేదు. ఏది ఎలావున్నా మంత్రిపట్ల ఆయన నమ్మిక, అభిమానమూ కొంచెమైనా సడలలేదు. నిజానిజాలు బయల్పడాలంటే మంత్రి తిరిగిరావటం చాలా అగత్యం. ఉద్దేశం ఏదైతేనేమి, ఇప్పుడు శక్తిసింహుడు



చేస్తున్న ప్రయత్నమంతా మంత్రిని తిరుగా రప్పించటానికే. అటువంటప్పుడు తన కిచ్చిన గౌరవం ఎందుకు నిలబెట్టుకోక పోవాలి?—బాగా ఆలోచించి, మారు మాటాడక అంగీకారం తెలిపాడు. ఆస్థాన వైద్యుడు గద్దె ఎక్కటం అందరకూ సంతోషం కలిగించింది.

* * *

ఆనాడు పారిపోయిన మంత్రిమాత్రం సామాన్యుడా! అంతంతమాత్రాన పట్టుబడి పోయే తెలివితక్కువవాడా! నిజానికి, అతడు అన్నింటికీ సిద్ధపడే వచ్చినప్పటికీ, ఇలా జరుగుతుందని కలలోనూ తలచ లేదు. అతడు కుశాగ్రబుద్ధి. తీరా పట్టుబడే పరిస్థితి ఏర్పడిందాయె! బ్రతికివుంటే, ఎన్ని శ్రమలైనాపడి తనకోరిక సాధించ టానికి వీలవుతుందిగాని, పట్టుబడిపోతే ఇంకేముంది! శక్తిసింహుని దుర్నయమూ, తన నిష్కాపట్యమూ లోకానికి వెల్లడిం చాలి! అందుకోసమే బాకు జారిపోయిం దనగానే వెనుకచూపు లేకండా, మెరపు మెరసినట్టుగా మాయమయ్యాడు!

శరవేగ వాయువేగ మనోవేగాలతో నరుడికంటపడని కారడవులలో దూరి పోయాడు. శక్తిసింహుని అశ్వికులు చేయ గల ప్రయత్నాలన్నీ చేసి, విసిగి వేసారి, నిస్పృహతో మరలిపోయారు.

ఎన్నెన్నో కష్టాలుపడి, రాత్రీ పగలూ ఏకబిగిని రెండురోజులు ప్రయాణం చేయగా, మంత్రికి అల్లంతలో ఒక పర్వత శ్రేణి కనిపించింది. దానిని చేరుకుందా మనుకొన్నాడు. కాని, అలసి సొలసివున్న ప్రాణికావటంచేత, దారిలోనే గుర్రంమీది నించి పడిపోయాడు.

పడిపోయిన ప్రాణికి ఆ నిర్జనారణ్యంలో దిక్కెవరు, మొక్కెవరు? కొంతసేపటి కల్లా తనంతట తనకే తెలివివచ్చింది.



బడలిక తీర్చుకొందామనుకున్నంతలో విమానంమోతలాంటి ఒకధ్వని వినిపించింది. చెవులు రిక్కించి, ఆ ధ్వనివచ్చిన దిక్కుకు చూచాడు. అది ఒక దొప్పవంటి చిత్రమైన అకారం! ఆకాశమార్గాన ఎగిరిపోతున్న ఆ దొప్ప కొద్దిసేపటిలోనే అగపడకుండా పోయింది.

'ఇడియేమిటి? ఎందుకు ఎగురుతున్నది? ఎలా మాయమయింది?' అని ఈవిధంగా మంత్రి బుర్రలో లక్షప్రశ్నలు పుట్టినై. అంతులేని కష్టాలకు ఓర్చి, ఐదురోజులయేసరికి బ్రహ్మాండమైన ఆ పర్వతశ్రేణి అవతలిభాగం చేరుకోగలిగాడు.

అడంతా మరొక ప్రపంచంలాగా కనిపించింది. అనాడు కనబడిన ఆ మాయదొప్ప ఎప్పుడు మళ్ళీ కనిపిస్తుంది, అదిచేసే మధురధ్వని మళ్ళీ ఎప్పుడు వినిపిస్తుంది? అని ఆత్రంతో కనిపెట్టుకునివున్న మంత్రికి అది కనబడలేదుకాని, అంతకుమించిన మరివకవింత అతని దృష్టిని ఆకర్షించింది.

కనుచూపుమేరలో ఆకాశాన్నీ భూమండలాన్నీ కలిపే ఒక రాట అగుపించింది. 'మనవాళ్ళు కథలలో చెబుతూవుంటారు, భూమినుండి స్వర్గానికి సరాసరి దారి వున్నదని. ఆదేనా యిది? ఐతే సన్నటి రాటలాగా వున్నదే యిది, దీనికి మెట్లెక్కడ?' అని అనుకొంటూ గుర్రం ఎక్కాడు. సగం దూరం వచ్చేసరికి రెండురోజులు పట్టింది. అప్పటికి ఆ రాటవంటిది మరికొంచెం లావుగా, స్పష్టంగా కనపడి, అది ఒక స్తంభమైవుంటుందని తోచింది.

మరి రెండురోజులు శ్రమపడి ఆ చేరువకు సమీపించాడు. పరిశీలించిచూడగా, తను అనుకొన్నట్టు అది రాటా కాదు, స్తంభమూ కాదు. ఒక అపూర్వమైనభవనం!

ఆ అద్భుతభవనం చూచీ చూడగానే 'ఇది మానవమాత్రులు నిర్మించిందేనా!

నిర్మించటానికి సాధ్యమవుతుందా ?' అని మంత్రి ఆశ్చర్యంపొందాడు. అది దీప స్తంభంలాగా గుండ్రంగా ఆకాశాన్ని అంటుతూ వున్నది. పైకి పోనుపోను విశాలమైవుంది. దాని కొట్టకొసని చిత్రమైన గుమ్మటం ఒకటి దాని అందాన్ని రెట్టించుతున్నది. భవనానికి పేర్చిన ఒక్కొక్క ఇటుక బంగారుమలామా చేసినట్టుండి, తళతళమెరుస్తూ, కన్నులు మిరుమిట్లు కొల్పుతున్నై. ఆ భవనపు అందచందాలనూ విడ్డూరాలనూ చూస్తూ అలా నిశ్చేష్టుడై నిలబడేసరికి, దిగువను ఒకచోట నలుచదరంగా కీటలుకనుపించినై.

అక్కడకు వెళ్ళి ఆ భాగం కదిపి చూచాడు. నిజానికి అది ఒక మరతలుపు. అతడు కదపగానే లోపలకు దారిచ్చింది. అతడు లోపల ప్రవేశించినవెంటనే మళ్ళీ ఎప్పటిలాగా మూసుకుపోయింది. నాలు గడుగులు వేశాడోలేదో, మనిషి పట్టేటంతటి ఒక బోనువంటి పెట్టె కనబడింది. దానికి ఒకవైపున ద్వారమున్నది. అందులో అతడు అడుగుపెట్టగానే అది రంయ్‌మంటూ అతనిని పైకంటా తీసుకపోయి, ఆగింది. మహిమగల ఈ వింతకు అబ్బురపడుతూ, మంత్రి ఆ బోనుదిగి, అలా అలా పోసాగాడు.




అవన్నీ విశాలమైన గదులు : ఒక గదిలో చిన్నప్పుడు రాజకుమారులకు పనికివచ్చే రకరకాల ఆటవస్తువులున్నాయి. ఒకగదిలో అద్దాల బీరువాలూ, వాటినిండా రాచబిడ్డలు ధరించే దుస్తులూ ఉన్నాయి. ఇంకొక గదిలో చక్కటి బొమ్మలపుస్తకాలు! ఆ పుస్తకాలలోని పత్రాలు తిరగవేస్తే లోకంలో జరిగే చర్యలన్నీ తెలుసుకోవచ్చు. అటు దేవలోకంలోనూ, ఇటు నాగలోకంలోనూ జరిగే వింతలుకూడా అగపడతై.

ఇటువంటి చిత్రవిచిత్రాలైన గదులన్నీ చూడటం పూర్తికాగానే, చిట్టచివర అతడు ఒక పెద్ద ద్వారంవద్దకు చేరుకున్నాడు.

అది తెరిచేటప్పటికి నందనవనంలాటి పువ్వులతోటలోకి దారిచూపింది. ఆ వువ్వుల సౌందర్యమూ, పరిమళమూ అతన్ని పరవశుణ్ణి చేసినై. కొంచెంసేపు ఆ పరిమళాలు ఆఘ్రాణించి, ఇంకా ముందుకు వెళ్ళాడు. వెళ్లగా ఇంకొకద్వారం తగిలింది. అది అపురూపమైన ఫలజాతులుగల ఒకతోటకుదారి చూపింది. మంత్రి విస్మయం చెప్పతరం కాదు. తినగలిగినన్ని ఫలాలు తిన్నాడు. కనివిని ఎరుగని ఆ ఫలజాతులు ఒక్కొక్కటే చవిచూస్తూ ఇంకా సాగిపోయేసరికి, మరొక ద్వారం కనిపించింది. అది తెరవగా, రాచ కుటుంబీకులు జలకమాడే కోనేరు నిర్మలమైన జలంతో నిండి కనువిందుచేస్తున్నది. కోనేరుపక్కనే ఒక గచ్చుచేసిన చెరువున్నది. దానినిండా వేడినీళ్ళు ఉన్నాయి. స్నానంచేయటానికని ఏర్పాటైన ఆ పరికరాలు, పద్ధతులు, సౌకర్యాలూ అతడు జన్మలో చూచి ఎరుగడు.

ఇంత ప్రదేశం తిరిగినప్పటికీ ఎవరుకాని వచ్చి అతనిని ఏమీ ప్రశ్నించలేదు. అందుచేత, సాహసించి పరిశుభ్రంగా కోనేటిలో స్నానంచేసుకున్నాడు.

అటుతరువాత మరికొంతదూరం సాగిపోగా, ఒక పెద్దహాలు అగుపించింది. అదంతా పాలరాళ్లతో చపటాచేసి వుండటం చేత, అద్దంలోమోస్తరుగా నీడ కనపడుతూ వుంది. అక్కడ మెత్తటి దిండు అమర్చిన ఒక కుర్చీలో కూర్చున్నాడు. అప్పుడు అతనికి అనేకమైన ఆలోచనలు పోయినై: 'ఇంతకుముందు విన్నటువంటి ఆ మధుర ధ్వని ఏమిటి? దొప్పవంటి దాని ఆకారం యేమిటి? చిత్రమైన ఈ భవనమేమిటి? రాజభోగ్యములైన ఈ సదుపాయాలన్నీ ఏమిటి? ఇంత బ్రహ్మాండమైన భవనంలో ఒక్కపురుగైనా సంచరించకపోవడమేమిటి?—' అని అనేకవిధాల జిజ్ఞాసపడ సాగాడు. —(ఇంకా వుంది)






## 6

భవనంలోని వింతలకు అబ్బురపడుతూ, అక్కడి అజ్ఞాత పరిస్థితులకు జిజ్ఞాస చెందుతూ, మంత్రి అలానే కూర్చుండిపోయాడు. గాఢమైన ఆలోచనలో అతనికి వేళాపాళా తెలియనేలేదు. ఇంకా కొద్ది సేపటిలో ప్రొద్దుగ్రుంకుతుందనగా అల్లంత దూరంనించి వీనులవిందుగా ఒక మధుర ధ్వని వినిపించింది. ఐతే, ఈ ధ్వని ఇంతకుముందు మంత్రికి పరిచయమైందే. లోగడ మాయదొప్ప చేసివున్న ధ్వని ఇదేనని అతడు వెంటనే గ్రహించాడు.

క్రమంగా ఆ ధ్వని అతనికి దగ్గరయింది. మరి కొద్దిసేపటిలోనే మాయదొప్ప ఈ భవనంపైకి వచ్చేసి, ఆగింది. అది ఆగటమేమిటి, దానిమోత నిలిచిపోవడమేమిటి? రెండూ ఒక్కమాటే జరిగినై.

'దొప్పలాగా కనబడే ఇది ఒక విమానం. ఈ విమానంమీద ఎవరోగాని ఈ భవనానికి వస్తూపోతూ వుంటారు' అని, తను చూచిన దాన్నిబట్టి మంత్రి ఊహించాడు. అతడు ఇలా ఆలోచించేటంతలోనే అలికిడి అయింది. అది మనుష్యులుచేసే అలికిడే!

మరుక్షణంలోనే ఎదట ప్రత్యక్షమై "ఎవరవునీవు? ఎలావచ్చావు? ఎందుకు వచ్చావు?" అని గబగబ ప్రశ్నలు కురిపిస్తూ ఒక చిన్నారి బాలుడు అతనికి కనిపించాడు.

బాలుడు కంటపడటంతోనే ఆశ్చర్యమూ, ఆవేశమూ మంత్రిలో ఒక్కసారిగా పెల్లుబికనై. "ఏమిటీ! దేవసింహుడే!!– ఎన్నాళ్లకు చూచానోయి నా తండ్రీ!!!" అంటూ, ఆత్రంతో బాలుణ్ణి చేరదీసుకోబోయాడు మంత్రి.



కాని, ఆ బాలుడు మంత్రికి దొరకనే లేదు. "దుర్మార్గుడా!—సౌధంలో చొరబడటమే గాకుండా నన్నెత్తుకుపోవటానికి చూస్తున్నావా? మా అమ్మతో చెబుతానుండు నీపని..." అని అంటూ చేతనున్న మాయదండం తను వేసుకొన్న చెప్పులకు తాకించాడు. తాకించటమే తడవుగా మహిమగల ఆ చెప్పులు కుర్రవానిని భవనంలో ఎక్కడికో తీసుకపోయినై. ఇదంతా చూడగా, ఆ బాలుడు సొట్టవాడనికూడా రూఢి అయింది. నివ్వెరపోయాడు మంత్రి.

"ఇదేమిటి వింత!— చనిపోయాడనుకున్న నా దేవసింహుడు ఇక్కడనేవున్నాడే! సొట్టబాలుణ్ని కళ్ళారా చూచానే! నమ్మకపోవటమెలా? పైగా, 'మా అమ్మతో చెబుతానుండు నీ పని...' అంటూ పారిపోయాడే? ఆహా!—మా దేవప్రియకూడా బ్రతికేఉన్నదా? మా తల్లి దేవప్రియ జీవించివుండటంకంటే నాకు కావాలిసిందేమిటి? ఇవాళ ఎంత అదృష్టం! ఎంత అదృష్టం... ఎటువంటి సుదినం!!!—అయితే, తల్లీ కొడుకులిద్దరూ భూలోకంలో అవతారం చాలించి ఇలా స్వర్గంలోకి వచ్చేశారన్నమాట! ఇంతకూ, నేనిప్పుడు ఏలోకంలో వున్నాను? ఇది స్వర్గలోకమేనా? లేకుంటే, ఈ అపూర్వ సౌధమేమిటి? కనివిని ఎరుగని ఈ వింతలేమిటి? అన్నిటికంటే చిత్రం, మృతజీవులను కళ్ళారా నేను చూడగల్గడమేమిటి?—వచ్చి వచ్చి నేను సరాసరి స్వర్గమే చేరుకున్నానా? అవును. సందేహంలేదు. పసివాడు, దేవసింహుడు పాపం—చూడగానే నన్ను గుర్తించలేకపోయాడు. ఎవరినో అనుకుని కంగారుపడ్డాడు. పోనీ, నెమ్మదిపడనీ. కాస్తంత మచ్చికయితే వాడే పోల్చుకుంటాడు. ఇక్కడ వాడు క్షేమంగా ఉన్నాడని తెలుసుకొన్నా. చాలు. అదే పదివేలు.

మరికొంచెంసేపు నిరీక్షించినట్టయితే, మా తల్లి దేవప్రియ ఇవతలకు వస్తుంది. ఆమెనుకూడా చూడవచ్చు. నిజంగా ఇవాళ ఎంత సుదినం! ఎంత సుదినం!!" అని ఈవిధంగా తనలో తనే తర్కించుకొంటూ అపరిమితమైన ఆనందంపొందుతూ, రాణి దర్శనంకోసం ఎదురుతెన్నులు చూస్తూ, అక్కడనే పచార్లుచేస్తూ వున్నాడు.

* * *

ఇక అక్కడ శక్తిసింహుడి పరిస్థితి ఏలా వున్నదంటే : పారిపోయిన దుష్టమంత్రిని పట్టితెస్తాము' అని పంతంపట్టి వెళ్లినవాళ్లలో ఒక్కడూ తిరిగిరాలేదు. మరి, అటువంటప్పుడు శక్తిసింహుడిమనసు ఎలా వుంటుంది?

ఉన్నవాడున్నట్టుగానే ఆస్థానవైద్యుడి వద్దకు వెళ్లి, 'గురూజీ!—మన మంత్రి సామాన్యుడుకాడు. తెలుసుకదా! అసహాయశూరుడు. అజేయుడు. అటువంటివాడిని పట్టితెస్తామని ఉద్రేకపడి బీరాలు పలికారేగాని, మనవాళ్లవల్ల నేమవుతుంది? అతన్ని వెతికిపట్టడం వాళ్లకు సాధ్యంకాదని నాకు అప్పుడే తెలుసు. ఇక యిప్పుడు—ఏమైనాసరే, మీరు పూనుకొంటేనే ఈ విషయంలో




మాటతక్కుతుంది. లేకుంటే లేదుమరి. ఇది శ్రమదమాదులతో కూడుకొన్నపని అని తెలిసికూడా తప్పనిసరిగా ఈపని మీకు వప్పగించవలసి వచ్చింది. ఏమంటారు?' అని అడిగాడు.

ఈపని వైద్యుడికి చాలా ఉత్సాహాన్ని కలిగించింది. ఏమీ అంటే : గుదిబండగా వుంటున్న రాజ్యపాలన తప్పిపోవటం; కుతంత్రాలు పన్నుతూవుండే శక్తిసింహుని ఎదటనుండి విరగడైపోవటం; మించి, తనకు అభిమానధనుడైన మంత్రిని చూడబోవటం — ఇన్నికార్యాలు ఒక్కసారిగా కలిసివస్తున్నవాయె.



ఈ కారణాలన్నీ వైద్యుని మనస్సులో మెరపు మెరసినట్టుగా స్ఫురించినై. అందు చేత, శక్తిసింహుడు అడగటమే తడవుగా "రాజా!—నీమాటకు ఎన్నడైనా తిరుగున్నదా? ఇదుగో, ఇప్పుడే బయల్దేరుతున్నా" అనిచెప్పి, తక్షణమే ప్రయాణానికి తగిన ఏర్పాట్లు చేసుకున్నాడు.

పరివారంతో సహా వైద్యుడు పదిరోజుల పాటు నడవగా, కొండప్రదేశం తగిలింది. చేరువనే ఒక పెద్ద మైదానం కనిపించింది. కొంచెం విశ్రమించి మళ్ళీ నడక సాగించారు వాళ్ళు. ఒక్క నూరుగజాలు వెళ్ళే సరికల్లా ఒకచిత్రం జరిగింది.

భటులు ముందుకు నెట్టుకుపోతున్నారు. వారికి ఏదో అడ్డువచ్చినట్టనిపించింది. తేరి చూచారు. ఎదట యేమీలేదు. పోదామని మళ్ళీ యత్నించారు. కాని, మునుపటి లాగానే ఏదో అడ్డుకోవటంవల్ల పోలేక పోయారు. అందరూ కలిసి వైద్యునిదగ్గరకు వెళ్ళి "అయ్యా, మేము పోదామంటే తోవ ఈయకుండా ఏదో మమ్మల్ని ఆటంకపరుస్తున్నది. అది చేతికి తగులుతున్నది కాని, కంటికి కనిపించటంలేదు. ఈ విడ్డూరం యేమిటో కనిపెట్టాలి మీరు" అంటూ విన్నవించుకున్నారు.

ఆస్థానవైద్యుడు పట్టలేని సంతోషంతో పైకీకిందికీ చూస్తూ, పచార్లు చేయసాగాడు. 'ఇదేమిటి? దారీ తెన్నూ తెలియక మనందరమూ ఇలా బాధపడుతూవుంటే ఈ పెద్దమనిషి ఏమీ పట్టించుకోకుండా వుంటున్నాడే? చీమ కుట్టినట్టయినా లేదే ఆయనకు?' అని భటులు తమలో తాము గుసగుసలాడుకో సాగారు. 'ఇటువంటి సమయంలో ఆయనకీ నిశ్చింత ఏమిటి? ఆ పరమానంద మేమిటి?'—అని వారిల్లో కొందరు తెలివిమంతులు ప్రశ్నించుకో సాగారుకూడా.

అంతలోనే ఆకాశమార్గాన విమానం మోత వినిపించింది. అది, వాళ్ల తలమీది నించి జోరుగా ఎక్కడికో పోతున్నది. అప్పుడు వైద్యుడు వారిని వేగిరపెట్టి, "ఆలోచనా పాలోచనా లేకుండా చూస్తూ కూర్చున్నారేమిటయ్యా! పదండి. ఆ విమానం ఏమిటో, అందులో ఉన్నవారెవరో కూడా పోయి కనిపెట్టిరండి. ఈలోపల నేనిక్కడనేవుండి, ఈ ఆటంకానికి కారణ మేమిటో కనుక్కుంటాను" అని హెచ్చరించాడు.




అందుకు వాళ్ళు 'అయ్యో, ఏమో ననుకొన్నాము. వైద్యుడు ఉదాసీనంగాలేడు. ఈ దృష్టిమీదనే వున్నాడు. ఏమీ పట్టించుకోవటం లేదనిచెప్పి ఆయనను గురించి తొందరపాటుగా అభిప్రాయపడ్డాము. పొరపాటు' అనుకొని పశ్చాత్తాపం చెందారు. వైద్యుని అజ్ఞను శిరసావహించి, పైన విమానపు జాడ చూచుకొంటూ, భూమి మీద దారిచేసికొంటూ పడివడిగా వాళ్లు పోసాగారు.

ఇలా వాళ్ళు అక్కడినుండి వెళ్ళిపోవటమే వైద్యుడికి కావలిసింది. ఇంత మంది పరివారాన్నీ అడుగు వేయనీయక అడ్డగించింది ఒక అపూర్వసౌధం. ఆ సౌధం ఒక్క వైద్యుడికిమాత్రమే స్పష్టంగా ఎదట కనిపిస్తున్నది. తక్కిన మరెవళ్ళకూ కనిపించలేదు. వాళ్లందరకూ భవనం చేతికి తగులుతున్నదే కాని, కంటికి కనిపించలేదు.

భవనం చూడగానే వైద్యుని సంతోషానికి మేరలేకపోయింది. పరివారానికి ఇది ఎంత మాత్రమూ కనిపించకపోవటంచేతనే వాళ్ళు తాపత్రయపడుతున్న సంగతి మొదటనే గ్రహించాడాయన. అందుకనే నవ్వు పట్టలేకపోయాడు. ఇదేదో మహిమ గల రహస్యభవనమని వెంటనే ఆయనకు అవగతమయింది. లేకుంటే—ఆ దివ్య



భవనం తనకు మాత్రం కళ్లయెదట స్పష్టంగా కనిపించడమేమిటి? తన పరివారం దారీ తెన్నూ తెలియక, ఎవరో ఆటంకపరుస్తున్నారని గోలపెట్టడ మేమిటి?

ఈ దేవరహస్యం పిట్టకైనా వెల్లడించకూడదు అని నిశ్చయించుకొన్నాడు. అందుచేతనే, పరివారమంతా విరగడైపోతే తన పరిశోధనలు స్వేచ్ఛగా సాగించుకోవచ్చునని ఆయనకు తొందరపాటు కలిగింది. అదృష్టవశాన, ఆ విమానపుమోత వినిపించటమూ, ఆ మిషమీద వాళ్ళను అవతలకు సాగనంపటమూ జరిగింది. ఇంతవరకు బాగానే వున్నదనుకొన్నాడు.

విచిత్రమైన ఈ భవనంయొక్క కీలకం కనిపెట్టాలనే ఆత్రంతో వైద్యుడు పచార్లు చేస్తూ అడుగులు వేయగా వేయగా, అతని కాలికి ఒక చిన్న మీట తగిలింది. తగలగానే నలుచదరంగా భూమిమీద ఒక బీట ఏర్పడింది. వైద్యుడు నించున్నపాటునే దిగువకంటా వెళ్ళిపోయాడు. 'పాతాళ లోకంలోకేమైనా దిగిపోతున్నానా?' అని ఆయనకు దిగ్భ్రమ కలిగింది.

తనను అలా కిందికి తీసుకపోతున్న యంత్రమేదో వైద్యుడికి కనిపించలేదు. కాని, కొంత దూరం వెళ్లి అది ఆగింది. ఆగినవెంటనే ఒక ద్వారం కనిపించింది. ద్వారంలోపలికి వెళ్లిచూడగా అది ఒక బోనువంటి పెట్టె!

వైద్యుడు పెట్టెలో ప్రవేశించాడో లేదో, రంయ్‌మంటూ ఆయన్ని పైకంటా తీసుక పోయింది. తీసుకపోయి ఒకచోట ఆగేసరికి మంత్రి ఎదురువచ్చాడు. ఒకరినొకరు చూచుకొని, ఇద్దరూ విస్తుపోయారు. తన తపం ఫలించినందుకు వైద్యుడు అపారమైన ఆనందంలో మునిగిపోయాడు. ఆయనకు మంత్రి కంటపడగానే కొంతంత ధైర్యం వచ్చింది. ఇంతవరకూ తనుచూచిన

చిత్రాలన్నీ మంత్రి వైద్యుడికి కూడా చూపించగా ఆయన తన్మయుడయ్యాడు. విశేషాలన్నీ విప్పిచెప్పగా వైద్యుడు పరవశత్వమే పొందాడు. ఈ విధంగా మంత్రీ, వైద్యుడూ తలవనితలంపుగా కలుసుకున్నాక పరిస్థితులు ఎంత చిత్రంగా పరిణమిస్తాయో చెప్పేదేమిటి?

* * *

తను అంతగా నమ్మికొలిచిన ఆస్థాన వైద్యుడుకాని, వెంటవెళ్ళిన పరివారంలో ఒక్కళ్లయినా కాని మరలిరాలేదు. మను మళ్ళి పంపినప్పటికీ వాళ్లజాడ అయినా తెలియలేదు. ఏమనుకోవాలి? ఇంతమందీ కలిసి ఎక్కడికి పోయినట్టు? ఈవాలకం చూచి అట్టుడికిపోయినట్టు ఉడికిపోసాగాడు శక్తిసింహుడు.

'నా జాతకప్రభావ మేమిటోగాని, ఏమి చేదామన్నా ఎదురెత్తుగానే వస్తున్నది! చేతిలోపనికదా అనుకున్నదే చేయలేక పోతున్నాను. నా మనిషేకదా అనుకున్న వాళ్లందరూ తడిగుడ్డతో గొంతుకోస్తున్నారు. వైద్యుడు ఇలా నన్ను మోసగిస్తాడని కలలోనైనా తలపగలనా? ఆయనను గద్దె యెక్కించి, తెరవెనుక నాటకమాడదా




మనుకుంటే, నా ఆశలన్నీ ఈవిధంగా పరిణమించినయ్యే!

'పోనీ అని కుటుంబానికా ఏవిధంగానూ నిర్వాహకం చేయలేకపోయాను. పెద్దవాడికి పట్టంకడదామనుకుని ఎంతగానో తాపత్రయ పడితే, వాడు నన్ను నడిసంద్రాన ముంచి పోయాడు! నా సంసారాన్నే నేను ఉద్ధరించుకోలేకపోయినప్పుడు నాకీ రాజ్య మెందుకు? ఏలడ మెందుకు? ఏది ఎలా పోతే నాకేమి?

'ఆదినుంచీ ఇది అనాథ రాజ్యమే! మధ్యనివచ్చి ఏమో చేదామనుకొంటే మటుకి కుదురుతుందా? ఊహుc. ఆపేరు

అలా శాశ్వత బ్రహ్మకల్పంగా నిలిచిపోవలసిందే. ఈ చెడ్డపేరులేకుండా చేదామని తలిచేటంతలోనే కష్టాలు నన్ను ముసురుకుని, నా కుటుంబాన్ని గంగలో ముంచినై. ఏది యెలాపోతేపోనీ. ఇకనేను తాపత్రయపడను' అంటూ వైరాగ్యభావం కనబరిచాడు శక్తిసింహుడు.

రాజ్యకాంక్ష సడలిందికాని, శక్తిసింహునికి మంత్రిమీది కార్పణ్యంమాత్రం కొంచెమైనా తగ్గలేదు. బొందెలో ప్రాణంవుండగా, తనకు బద్ధశత్రువైన మంత్రి శిక్షపొందటం కనులారాచూస్తేకాని నిదురపోకూడదనుకొన్నాడు. ఇదే తనకు జీవితంలో మిగిలివున్న కోరిక. ఇందుకోసమని ఎలా అయినా మంత్రిని పట్టాలి.

మంత్రిని పట్టటానికి ఎవరినిపంపితే వారే తిరిగిరాకుండా వున్నారు. కనుక ఈ మాయఏమిటో తనే స్వయంగా తెలుసుకోవటానికి అతడు నిశ్చయించుకొన్నాడు. ఈ నిశ్చయంతో రాజ్యాన్ని ప్రజలఇష్టానికే వదిలేసి, తను పాదచారిఐ, మంత్రిని వెదుకటానికని బయల్దేరాడు.

శక్తిసింహుడు ఎన్నో శ్రమలకు లోనై, కొన్నాళ్ళకల్లా ఒక మహారణ్యం చేరుకొన్నాడు. చేరుకొని, ఒక చెట్టునీడని విశ్రమించాడు. ఆ మహారణ్యం ప్రక్కనే ఒక మైదానమున్నది. బడలికచేత అతనికి చిన్న కునుకు పట్టేటంతలో ఒక విమానంవంటిది శబ్దంచేసుకొంటూవచ్చి ఆ మైదానంలో విడిసింది. అందులోనించి అందాల బాలుడొకడు దిగి, చేతులతోనూ కాళ్ళతోనూ దేకుకొంటూ అరణ్యంలోని చెట్లవైపు రాబోయాడు.

ఈ సందడికి శక్తిసింహునికి మెలకువ వచ్చింది. తనవైపే వస్తున్న ఆ అందాల బాలుణ్ణి చూచీ చూడటంతోనే అతడు కెవ్వున కేకవేసి, వానిని పట్టుకుందామని లేచాడు. —(ఇంకా వుంది)






## 7

[తను పంపిన వైద్యుడూ, అతని పరివారమూ ఎంతకాలానికీ తిరిగి రాకపోయే సరికి, శక్తిసింహుడు స్వయంగా మంత్రిని పట్టాలని దీక్షబూని బయలుదేరటం, ఒకానొక మహారణ్యమధ్యంలో ఒక కుర్రవాడు కనుపించగా, కెవ్వున కేకవేసి ఆ కుర్రవానిని పట్టబోవటంవరకూ చదివారుకదూ? ఆ తర్వాత—]

శక్తిసింహుడికి కనుపించిన ఆ కుర్రవాడు మరెవరో కాదు, దేవసింహుడే! తన మాయ దొప్పలో అలాఅలా తిరుగుతూ ఆ అరణ్యంలోకి రావటం సంభవించింది. అయితే, శక్తిసింహుడైనా ఆ కుర్రవాడు దేవసింహుడేనని పూర్తిగా అనవాలుకట్టలేదు. కాని, చూచీ చూడటంతోనే దేవసింహుడే ఐవుంటాడేమో నన్న అనుమానం కలగటంచేతనే అలా కెవ్వున కేకవేసి వానిని పట్టబోయాడు. ఇంతకూ దేవసింహుడు దొరకనేలేదు. మహిమగల ఆ విమానంమీద అతడు రివ్వున ఎగిరిపోయాడు.

ఇక్కడ శక్తిసింహుడి సంగతి, అక్కడ మంత్రి, ఆస్థానవైద్యుడి సంగతి అటుంచి దేవసింహుడి చిత్రచరిత్ర చూదాం :

ఇంతకాలంగా దేవసింహుడు తన విమానంలో బయటకు వచ్చినా భవనం చూపుమేర దూరంలో కనబడేటంత దూరం వరకు మాత్రమే వెళ్లేవాడు. కాని ఆ పైకి వెళ్ళేందుకు సాహసించేవాడు కాడు. కాని ఎప్పుడైతే తన భవనంలోకి కొత్తమనుషులు వచ్చారో, అనాటినుంచీ తన స్వేచ్ఛ ఎంతో తగ్గిపోయినట్టు బాధపడసాగాడు. వాళ్ళు యెంతవరకూ భవనం వదలిపోవటం




కనబడకపోయేసరికి నిరాశచెందాడు. ఇంతకంటే ఆ విమానంలో అలా ప్రపంచమంతా చుట్టిరావటమే బాగుండేటట్టుందనుకొన్నాడు. అనుకొని, ఈపర్యాయం భవనం వదలి ఎన్నో ప్రదేశాలు దాటుకొంటూ చాలదూరం వచ్చేశాడు. అప్పటికి మూడు రోజులైంది అతను భవనం వదలి వచ్చేసి. అయినా అలా తిరుగుతూ వుండటం సుఖంగానే తోచింది. అయితే ఆ సుఖం—అట్టే కాలం నిలవలేదు.

దేవసింహుడు ఆకాశంలో చాలాఎత్తున వెళుతున్నాడు. అకస్మాత్తుగా కారుచీకట్లు కమ్ముకొచ్చి, కొద్దికొద్దిగా వానతుంపరలు



కూడా ప్రారంభమైనై. ఏమిటిచెయ్యటం? తడిసిపోక తప్పేట్టులేదు. పోనీ, తిరిగి భవనం చేరుకుందామన్నా మరో మూడు రోజులకు కాని చేరుకోలేడాయె. అలో చిస్తూన్నంతలోనే వర్షం పెద్దదై, పాపం దేవసింహుడు తడిసిపోయాడు. అయితే చిత్రం! అంత వర్షం కురుస్తున్నా ఆ డొప్పలో ఒక్క నీటిబొట్టుకూడా నిలవలేదు.

తడిసిపోయిన దేవసింహుడు చలికి గజగజ వణికిపోసాగాడు. 'ఈసమయంలో కంబళిఅయినా వుంటే బాగుండిపోనుకదా' అనుకొన్నాడు.

అతడిలా అనుకోవటమేమిటి, ఒక మెత్తటి ఉన్ని ముసుగు వచ్చి వంటిని కప్పివెయ్యట మేమిటి, ఒకేమారు జరిగింది. దేవసింహుడి ఆశ్చర్యానికి అంతులేదు. తన అదృష్టానికి మురిసిపోతూ, ఆ ఉన్నిముసుగు ఒళ్లంతా కప్పుకొని 'ఇకనైనా ఇంటిముఖం పట్టకపోతే మాట దక్కదు' అనుకుంటూ "అబ్రకడబ్రా, టుమ్‌టుమ్‌టీ" అన్నాడు.

ఎప్పుడైతే దేవసింహుడి నోటినుంచి ఈ మాటలు వెలువడినయ్యో, పోతూపోతూ వున్న విమానం టక్కుమని ఆగింది. ఆగి, గిరుక్కున తిరుగుముఖంపట్టి మళ్లీ వేగంగా

పోసాగింది. ఇక ఫరవాలేదనుకొంటూ దేవసింహుడు, ముసుగు కప్పుకొని దొప్పలోనే వెచ్చగా పడుకొన్నాడు.

కాని అలా ఎంతోసేపు పడుకోలేక పోయాడు. ఎందుచేతనంటే మరికొద్దిసేపటికల్లా వర్షం పూర్తిగా తగ్గిపోయి, మళ్ళీ ఫెళఫెళమని ఎండ కాయటం మొదలుపెట్టింది. చలిగా వున్నప్పుడేగాని, ఎండగా వున్నప్పుడు కంబళి ఏం సుఖం? దేవసింహుడి ఒళ్ళు ముచ్చెమటలుపోసింది. "ఇక ఈకంబళితో పనిలేదు" అని దానిని కిందకు విసిరివేశాడు.

సరీగా అదే సమయంలో ఒక గొర్రెల కాపరి అటు వెళుతూ వుండటం, దేవసింహుడు విసిరివేసిన కంబళి వాడికి దొరకటం సంభవించింది. వాడు ఆశ్చర్యపోతూ తలెత్తిపైకి చూచేసరికి దేవసింహుడు అప్పటికప్పుడే చాలదూరం దాటిపోయాడు. గొర్రెలకాపరి కంబళి బుజాన వేసుకొని మురిసిపోతూ తనదారిన వెళ్లిపోయాడు.

మరికొద్దిసేపటికి దేవసింహుడికి అమిత దాహంవేసింది. అయితే, నడిఆకాశంలో సంచరిస్తున్న సమయంలో నీళ్ళెక్కడినుండి వస్తయ్! అప్పటికే చాలసేపటినుంచి వుగ్గబట్టుకొని వున్నాడు. కాని యిక వుండ



లేకపోయాడు. "నాలుక పీక్కుపోతోంది. భవనం చేరటానికి ఎలాలేదన్నా యింకో రోజు గడవాలి. అప్పటివరకూ యిలా దాహంతో నాలిక ఎండిపోవలసిందేనా?" అని పైకి నిట్టూర్చాడు.

ఎప్పుడైతే దేవసింహుడు ఇలా అన్నాడో, ఒక మైనాపిట్ట ఎక్కడినుండో చిన్నపాత్రను ముక్కున కరుచుకొచ్చి, దొప్పఅంచు పైన వాలింది. దేవసింహుడు ఆత్రంతో పాత్రలోకిచూచాడు. అది స్వచ్ఛమైన నీరు! తనను రక్షించటానికే ఆ మైనా వచ్చిందని గ్రహించాడు. పాత్రని తీసుకొని ఒక్క గుక్కలో తాగివేశాడు. కాని, చిత్రం! పాత్ర



ఖాళీకాలేదు సరిగదా తిరిగి నీటితో నిండి వుంది. ఆ నీళ్ళుకూడా మళ్లీ ఒకగ్రుక్కలో తాగేశాడు. అప్పటికీ ఖాళీకాలేదు. ఈ విచిత్రానికి ఆశ్చర్యపోతూ, దేవసింహుడు మైనాకు తన కృతజ్ఞత తెలపాలని దానికోసం చూచాడు. కాని అది యెప్పుడు మాయ మైందో యేమిటో కనుపించనేలేదు!

దేవసింహుడి ప్రాణాలు కుదుటబడినై. అనుకోనివిధంగా కష్టాలుకలిగినా, అవి ఏదోలాగా, దేవునిదయవల్ల తీరిపోయి నందుకు ధైర్యంచెంది, దేవసింహుడు తన మాయవిమానంలో ముందుకుసాగాడు.

* * *

అక్కడ భవనంలో మంత్రీ, వైద్యుడూ ఎలావున్నారో చూదాం.

తలవనితలంపుగా దేవసింహుడి జాడ తెలిసిరావటమేగాక, వానిని కళ్ళారా చూడ గలిగాముకదా అని మురిసిపోయేటంతలో, దేవసింహుడు తమ కర్మానికి తమని అలా భవనంలో వదిలివెళ్లటం, వెళ్ళి అప్పటికి వారంరోజులైనా అంతూపొంతూ తెలియక పోవటం, మంత్రినీ ఆస్థానవైద్యుడినీ ఎంతో కంగారుపరచింది. పోనీ, తమ రాణీ దేవ ప్రియ అయినా కనుపిస్తుందేమో, సంగతులు వెల్లడి అవుతవికదా అనుకుంటే, అదీజరగ లేదు. సరిగదా, మరోపురుగు ఆ భవనంలోకి రానేలేదు. ఇదంతా అగమ్యగోచరంగా తోచింది. ఎన్నాళ్ళని యిలా భవనంలో కన్నులు కాయలు కాచేటట్లు కావలా కాయాలో తెలియలేదు. అయినా, గత్యం తరం లేక అలానే ఉండిపోయారు.

అలావుండగా ఒకనాటి వేకువజామున ఎవరో భవనందగ్గరలో సంచరిస్తున్న అలికిడి అయింది. మంత్రీ, వైద్యుడూ ఆశతో వెళ్లిచూచారు. అయితే వాళ్లకొండంత ఆశా నిరాశగా మారిపోయింది. ఎందుచేత నంటే అవచ్చినది ఎవరోకాదు, శక్తిసింహుడే!

అయితే అతను భవనంలో ప్రవేశించక గ్రుడ్డివానిలా తడుములాడుతూ భవనం చుట్టూతా పచార్లుచేస్తున్నాడు. ఇందుకు కారణం మంత్రి అయితే గ్రహింపలేక పోయాడుగాని, వైద్యుడు యిట్టే గ్రహించి వేశాడు.

"అపూర్వమైన ఈ సౌధం ఏమిటో గాని దీనిలో మరో గొప్పచిత్రం వుంది. ఈభవనం కొందరికి కనుపించి, కొంద రికి కనుపించకపోవటం ఏమిటో ఇంద్ర జాలంగా వున్నది. ఈచిత్రం మీరు కని పెట్టారో లేదో!" అని ప్రశ్నపూర్వకంగా మంత్రివంక చూచాడు వైద్యుడు.

"అలాగనా" అని మంత్రి ఆశ్చర్యం కనబరిచాడు.

వారు యిలా మాట్లాడుకుంటూ తిరిగి శక్తిసింహుడికోసం చూచేసరికి అతడు అప్పటికప్పుడే వడివడిగా అడుగులువేసు కుంటూ భవనందాటి పోతూవున్నాడు. మంత్రికీ, వైద్యుడికీ యిది మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఇక్కడి కెలావచ్చాడో ఏమో, రానే వచ్చాడుకదా! ఏమీ తేల్చుకోకుండానే అలా ఎక్కడికి పోతున్నట్టుచెప్మా?" అని



ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. ఒక్కళ్ల ఊహకి ఏమీ అందలేదు.

మరొక రెండురోజులు గడిచాయి. తిరిగి అదే వేకువజామున తిరిగి అలికిడి. అయితే ఈమారు పెద్దఅలజడి! మంత్రీ, వైద్యుడూ చరచర తమస్థానాల్లోంచి లేచివెళ్లి భవనం లోంచి తొంగిచూచారు.

భవనంచుట్టూతా వందలాది భటులు, గునపాలూ గొడ్డళ్ళూ పుచ్చుకొని భవనాన్ని పడగొట్టటానికి సిద్ధంగావున్నారు. ఒక గుఱ్ఱం మీద శక్తిసింహుడు కూర్చొని, కళ్లవెంట చింతనిప్పులు కక్కుతూ, "ఊఁ, చూస్తారేం! కానివ్వండి, సూర్యోదయానికల్లా ఈమాయ




ఏమిటో పటాపంచలై మట్టిపాలు కావాలి" అంటూ శాసిస్తున్నాడు.

మంత్రి వైద్యుడు గజగజలాడిపోయారు. ప్రాణాలు అరచేతులో బెట్టుకొని క్షణమొక యుగంగా గడుపుతున్నారు. అయితే అలా గుడ్లప్పగించి కూర్చోవటమేనా? శక్తిసింహుడు పట్టుపట్టాడంటే సాధించితీరుతాడన్నసంగతి వారికి పూర్తిగా తెలుసు. అందుచేత, కాలయాపనచేస్తే, మరికొద్దిసేపటిలో భవనం కూలటమూ, దానితోపాటు తాముకూడా మట్టిపాలపటమూ ఖాయమనీ తెలుసు. కనుక ఆలోచిస్తూ కూర్చొని లాభంలేదని తేల్చుకున్నారు. తెగించి భవనంలోంచి బయటపడుదామని సిద్ధపడి కదలబోయారు.

కాని, అంతలోనే ఒక చిత్రం జరిగింది. ఇన్నేండ్లుగా తామంతా ఏ వృద్ధురాలి కొరకైతే ఎదురు చూస్తూవున్నారో, ఆమె, ఎక్కనుండి వచ్చిందో ఏమో, సరీగా భవనం నెత్తిమీదికి ఎగిరివచ్చింది. వచ్చి ఏమిచేసిందో ఏమో! శక్తిసింహుడి పరివారం అంతా పక్షులుగా మారిపోయారు. మారిపోవటమేకాదు, చూస్తూవుండేటంతలో రివ్వున ఎగిరిపోయారు. శక్తిసింహుడు మాత్రం గుఱ్ఱం మీద ఒంటరిగా నిలిచిపోయాడు.

అంతా రెప్పపాటుకాలంలో జరిగిపోయింది.

మంత్రీ, వైద్యుడూ విస్తుపోతూ భవనం పైకి చూచారు, వృద్ధురాలు యింకా ఏమి వింతలు చేస్తుందో చూతామని. కాని ఏదీ వృద్ధురాలు? తను వచ్చినపని అయిపోయిందన్నట్టుగా, ఆమె ఎప్పుడు మాయమైందో కాని, అచుట్టుప్రక్కల ఎక్కడా కనుపించనేలేదు.

శక్తిసింహుడు కోపంతో నిలువునా మండిపోతున్నాడు.

"నేను యింతా శ్రమపడితే చివరకి యిదా ఫలితం? కథ అడ్డం తిరిగిందే! ఈ వృద్ధురాలి మాయల ముందు మన పరాక్రమం ఎందుకూ పనికివచ్చేట్టు కనబడటంలేదే! నాకు దారిలేదా?" అని తనని తానే ప్రశ్నించుకోసాగాడు శక్తిసింహుడు.

కొంతసేపు మథనపడి, ప్రాణం విసిగెత్తిందోయేమో, శరవేగాన ఆచోటు విడిచి వెళ్ళిపోయాడు.

మంత్రికీ, వైద్యుడికీ ప్రాణాలు కుదుటబడినై. "హమ్మయ్యా. ఇప్పటికి గండం గడిచినట్టే!" అని ధైర్యంచెందేటంతలో మరొకచిత్రం జరిగింది.

హఠాత్తుగా పెద్ద భూకంపం వచ్చినంత పనిజరిగి, భవనం ఊగులాడుతున్నట్టు తోచింది. మరుక్షణంలో బ్రహ్మాండమైన మోత వినవచ్చింది. ఏమిటా ఈ విపరీతం? అని యోచిస్తుండగా, భవనం నామరూపాలు లేకుండా మాయమైంది. మాయమవటమే కాదు, అంతకుముందు అక్కడ ఒక భవనం నిలిచివున్న ఆనవాళ్లయినా లేకుండా పోయి ఆ ప్రదేశమంతా పెద్ద ఎడారిలా మారిపోయింది. ఆ ఎడారి మధ్యంలో మంత్రీ, వైద్యుడూ మాత్రం మిగిలారు.



ఇప్పుడీ అవాంతరంతో మంత్రికీ వైద్యుడికీ మతిపోయినట్టయింది.

"ఇక జరగవలసినపని ఏమిటి? తలవనితలంపుగా ఇటువంటి అవాంతరం వచ్చిపడిందే! 'ఇప్పటికి వెళ్ళాడుకదా, యిక ఫరవాలేదు' అని మనం యేమరుపాటుగా వుండటానికి వీలులేదు. మళ్ళీ తప్పకవస్తాడు. ఈసారి రావటమే జరిగితే మన అంతుతేల్చితీరుతాడు. కనుక మనం యిక ఈ నిర్జనప్రదేశంలో వుండటం శ్రేయస్కరంకాదు. ప్రస్తుతానికి, కొద్దిరోజుల పాటు మరెక్కడైనా తలదాచుకుని, ఆ తర్వాత రావటం మంచిదిగా తోస్తోంది.

ఏమిటీ మీసలహా?" అని వైద్యుడిని సలహా అడిగాడు మంత్రి.

"ఎంతో ధైర్యశాలురైన మీరే యిలా అధైర్యపడితే ఎలాగ? మనం వచ్చినపని యింతవరకు ఏమీ కానేలేదాయె. దేవసింహుడు ఏమయ్యాడో తెలియకనేపోయె. తొందరపడి మనం ఇక్కడినుండి వెళ్లటం ఏమంత సబబుగా తోచదు. అదీగాక ఎక్కడికని వెళ్ళేటట్లు? ఇక్కడనే వుండి యింకా ఏమేమిచిత్రాలు జరుగుతాయో చూదాం" అన్నాడు వైద్యుడు. సరేనన్నాడు మంత్రి. అందుచేత వాళ్ళు అక్కడనే వుండి, దేవసింహుడుగానీ, వృద్ధురాలుగానీ వస్తారేమోనని ఎదురుచూడసాగారు.

శక్తిసింహుడు వెళ్లివెళ్లి ఒక పర్వతశ్రేణి చేరుకున్నాడు. కష్టాలుపడి ఒక్కొక్క పర్వతమే దాటుతున్నాడు. చిట్టచివరి పర్వతం దాటుతున్నాడు. అయితే, ఆ పర్వతం వెళ్లివెళ్లి ఒక అగాధపు లోయ అంచున ఆగిపోయింది. లోయకు అవతలివైపు మరొక బ్రహ్మాండమైన పర్వతమూ, ఆ పర్వతంకొసని చిత్రమైన ఒక దేవాలయమూ కనుపించినై.

ఎలాగైనా అవతలి గట్టు చేరుకొని ఆ ఆలయమేమిటో తెలుసుకోగలిగితే బాగుండును అని అనుకున్నాడు అతడు. కాని నడుమనున్న ఈ అగాధపులోయ దాటటం ఎలా? అడుగు జారిందా అధోగతే! అయితే ధైర్యసాహసాలకూ, ఓరిమికీ పెట్టింది పేరాయె శక్తిసింహుడంటే. అంతమాత్రనికి వెనుకంజ వేస్తాడా? ప్రాణాలకు తెగించి లోయ దాటేందుకు సిద్ధపడ్డాడు.

---

[పర్వతంపైని ఆ దేవాలయ మేమిటి? ఇంతకూ దేవసింహుడు ఏమైనాడు? దేవప్రియ కూడా బ్రతికేవున్నదా? ఎడారిలాంటి ఆ ప్రదేశంలో మిగిలివున్న మంత్రీ, వైద్యుడూ ఏమవుతారు? ఇవీ, మరికొన్ని చిత్రాలూ వచ్చేనెల చదవండి.]






## 8

[దేవసింహుని జాడకోసం శక్తిసింహుడు ఎలాగో అపూర్వసౌధం చేరుకోవటం, అయితే తలవనితలంపుగా అది మాయమై, పరివారం పకులుగా ఎగిరిపోయి శ్రమ వృథాకావటం, ధైర్యంవిడువక అతడు వెతుకుతూపోయి ఒక పర్వతశ్రేణి చేరుకోగలిగినా, దారీతెన్నూ లేని ఒక పర్వతంకొనని ఆగిపోవలసిరావటంవరకూ చదివారుకదా! ఆ తర్వాత—]

ఏమైనాసరే అవతలిగట్టు చేరుకొని, ఆ కనుపించే దేవాలయమేమిటో తెలుసుకు తీరాలని పట్టుబట్టిన శక్తిసింహుడు అంతలోనే ఆలోచనలోపడ్డాడు: "అనవసరంగా తొందరపడి ఈ ప్రయత్నంలో నేను ప్రాణాలు కోల్పోయానంటే ఇంకేమున్నది? కనుక కొద్దిరోజులు ఆలస్యమైనా, మరో సులువైనమార్గంలో అక్కడ చేరే ప్రయత్నం చెయ్యటం మంచిది" అనుకున్నాడు. ఈ నిశ్చయంతో శక్తిసింహుడు వెనుకకు మరలి, తను ఎక్కివచ్చిన పర్వతశ్రేణి అంతా దాటి తిరిగి క్రిందకు చేరుకున్నాడు. అయితే, అతను పర్వతశ్రేణి ఎక్కేటప్పుడు తన గుఱ్ఱాన్ని దిగువని వదిలేసివచ్చాడు. అది ఎటుపోయిందో ఏమో ఇప్పుడు అక్కడ లేదు. చేసేదిలేక శక్తిసింహుడు కాలినడకనే బయలుదేరాడు.

ఇక దేవసింహుడి సంగతి చూదాం:

దేవసింహుడు తిరిగి తిరిగి తన భవనం చేరుకునేసరికే భవనం మాయమైపోయె! దిగువనిమాత్రం మంత్రి. ఆస్థానవైద్యుడూ వున్నారు. ఈ మాయ దేవసింహుడికి అర్థం కాలేదు. భవనం ఏమైనట్టు? క్రింపకు దిగివెళ్ళి వాళ్ళని అడిగితే తెలుస్తుందేమో?



అంతకు తప్ప మరోమార్గంలేదు. అందుచేత క్రిందకు దిగాలని నిశ్చయించుకున్నాడు. కాని చిత్రం! మాయవిమానం క్రిందకు దిగటానికి బదులు, ముందుకు పోసాగింది.

ఈమారు ఎలాగైనా దేవసింహుడికి నమ్మికకలిగించి తమతో తీసుకుపోవచ్చు నని ఆశపడిన మంత్రికీ, వైద్యునికీ యిలా జరగటం నిస్పృహ కలిగించింది. విమానం వైపే చూస్తూ వారు నిలబడిపోయారు.

దేవసింహుడి విమానం వెళ్ళివెళ్ళి, ఎత్తైన ఒక పర్వతంమీది దేవాలయం ముందు ఆగింది. శక్తిసింహుడికి లోగడ కనుపించిన దేవాలయమే యిది!

విమానం ఆగటమేమిటి, దేవాలయం ముందు వృద్ధురాలు ప్రత్యక్షం కావట మేమిటి? రెండూ ఒక్కమారే జరిగినై. దేవసింహుడి ఆశ్చర్యానికి అంతులేదు. ఈ చిత్రమేమిటని అతను వృద్ధురాలిని అడగ బోయేటంతలో ఆమె దేవసింహుడిని ఎత్తు కుని ఆలయంలో ప్రవేశించింది.

లోపలకు వెళ్ళాక దేవసింహుడు అడిగాడు: "అపూర్వమైన మన సాధం ఏమైంది? ఈ దేవాలయమేమిటి? ఇంత కాలమూ నా అదుపాజ్ఞలలో ఉంటూవచ్చిన విమానం యివాళ యిలా అడ్డుతిరగటానికి కారణమేమిటి?" అని.

ఇన్ని ప్రశ్నలకూ వృద్ధురాలు ఒకే జవాబుగా "ఇవన్నీ నువ్వు అడగకూడదు. అక్కడికంటే యిక్కడే ఎంతో హాయిగా వుంటుంది. అయితే కొంతకాలంవరకు నీవు విమానంలో బయటికి వెళ్లకూడదు. అందుచేత యిక్కడనే వుండి కులాసాగా కాలంగడుపుతూవుండు. నేనువచ్చి చూచి పోతూవుంటాను" అని చెప్పి వూరుకుంది.

ఇలా అంటూనే వృద్ధురాలు దేవసింహుడివద్దనున్న మాయవిమానం తీసుకున్నది. చూస్తూచూస్తూవుండేటంతలో



అంతటిపెద్ద వొప్పా ముడుచుకుపోయి, చిన్న బంతిలాగా తయారైంది. ఆ బంతిని ఆమె దేవసింహుడి చేతికిచ్చి, "దీనిని భద్రంగా దాచిపుంచుకో" అనిచెప్పి మాయమైంది.

వృద్ధురాలు వెళ్ళాక, దేవసింహుడు మెల్లిగా ఆ దేవాలయమంతా కలియతిరిగి చూచాడు. బయటినుండి చూడటానికి అది దేవాలయంలాగే ఉన్నప్పటికీ, లోపల ఎన్నో చిత్రాలు కనుపించినై. ఒకచోట రకరకాల పక్షులు కిలకిలమంటూ ఎగురుతున్నై. మరొకచోట లేళ్ళూ, దుప్పులూ మొదలైన సాధుజంతువులు కనుపించినై. ఇంకా లోపలికి పోగా భయంకరమైన సర్పాలు బుసలుకొడుతూ నేలపైన తిరుగాడుతున్నై. మరొకచోట గోండ్రుపెడుతూ సింహాలూ, పెద్దపులులూ తిరుగుతున్నై.

వీటన్నింటినిచూచి దేవసింహుడు భయపడనేలేదు. అవన్నీ మామూలు ఆటవస్తువులేనని అనుకొని, వాటిమధ్య నిర్భయంగా తిరుగసాగాడు. చిత్రమేమిటంటే అవికూడా దేవసింహుడిజోలికి పోకుండా తమ మానాన అవి తిరుగులాడుతున్నై.

దేవసింహుడు ఈ చిత్రాలన్నీ చూచుకుంటూ పోగాపోగా, ఒకచిన్న పూలతోట






కనుపించింది. దానిమధ్యని సరిగా తనకు ఈడూ జోడూ అయిన ఒకచిన్న కుర్రవాడు ఉల్లాసంగా ఆడుకుంటున్నాడు.

ఈ కుర్రవానిని చూడటంతోటే దేవసింహుడిప్రాణం లేచివచ్చింది. ఆ కుర్రవాడెవరో తెలుసుకోవాలనికూడా ప్రయత్నించలేదు. చరచర పాకుకుంటూ వెళ్లి—"ఆడుకుందాం, వస్తావా?" అని అడిగాడు.

"అలాగే! మరి నాతో సరిగా నువ్వు పరుగెత్తలేవుగా?" అన్నాడు ఆ కుర్రవాడు, దేవసింహుడి కాళ్లపంక జాలిగాచూస్తూ.

ఇన్నాళ్ళూ ఆటపాటలలో దేవసింహుడు తన అవిటికాళ్ల సంగతే మరిచిపోయాడు. తను కుంటివాడిననే ధ్యాసే లేదు. కాని, యిప్పుడు ఈ కుర్రవాడు యిలా అనటంతో తను అవిటివాడినన్న సంగతి మళ్ళీ గుర్తురాగా ఒక్కసారి దుఃఖం పొర్లుకొనివచ్చింది.

ఇదిచూచి ఆ కుర్రవాడు—"ఎందుకు ఏడుస్తావ్! ఫరవాలేదులే, రా ఆడుకుందాం" అంటూ దేవసింహుడిని ఓదార్చాడు. అప్పటినించి ఆ కుర్రవాడితో చేరి హాయిగా కాలం వెళ్లబుచ్చుతున్నాడు దేవసింహుడు.

ఇలావుండగా ఒకనాడు వృద్ధురాలు ఇచ్చివెళ్లిన ఆ బంతితో వాళ్లు ఆడుకొంటూవుంటే అది రివ్వున దేవాలయం దాటి దూరాన పడిపోయింది.

ఎంతో భద్రంగా దాచుకొనమని చెప్పి వృద్ధురాలు యిచ్చిన బంతి యిలా పోవటంతో దేవసింహుడు దుఃఖించాడు. అది చూచి, తోటికుర్రవాడు—"పోతే పోయిందిలే. ఇంతమాత్రానికి ఏడుస్తావేం!" అని ఓదార్చబోయాడు.

వృద్ధురాలు చెప్పినసంగతి వెల్లడించితే తన అజాగ్రత్త బయటపడిపోతుందని సిగ్గుపడ్డాడు, దేవసింహుడు. అందుచేత బంతిసంగతి అంతటితో వదిలేసి, మళ్లీ

ఎప్పటిలా ఆ కుర్రవానితో చేరి ఆడుకో సాగాడు.

* * *

కొంతకాలం గడిచింది. శక్తిసింహుడు అష్టకష్టాలూ పడి ఎలాగైతేనేమి ఆ దేవాలయం దరిదాపులకు వచ్చేశాడు. త్రోవలో కుర్రవాళ్ళు పారవేసుకున్న ఆ బంతి కంట బడి, దానినితీసుకుని పరిశీలనగా చూచాడు. దానిలో ప్రత్యేకత ఏమీ కనుపించలేదు. అయినా ఎందుకైనా మంచిదని తీసి తన వద్ద భద్రపరుచుకొని, దేవాలయంవున్న పర్వతం ఎక్కసాగాడు.

మరి కొద్ది సేపటికల్లా శక్తిసింహుడు దేవాలయద్వారంవద్దకు చేరుకున్నాడు. అయితే తలుపులు మూసివున్నయి. తెరవటానికి వీలులేకపోయింది. ఏమీతోచక, తలుపు తట్టాడు. బదులులేదు. అలానే కాచుకొని కూర్చున్నాడు.

* * *

అక్కడ మంత్రి, వైద్యుడూ కొద్దిరోజులు దేవసింహుడి రాకకు ఎదురుచూచారు. కాని ఏజాడా కనుపించక నిరాశచెంది, అక్కడవుండి ప్రయోజనంలేదని నిశ్చయించుకున్నారు.




మరునాడే ఆచోటు వదిలి దేవసింహుడిని వెతుక్కుంటూ బయలుదేరారు. కొద్ది రోజులు ప్రయాణంచేయగా, ఒకచోట శక్తిసింహుడి అశ్వికులు తటస్థపడ్డారు.

మంత్రిని వాళ్లు ఆనవాలుకట్టారు. ఆస్థానవైద్యుడుకూడా వెంటవుండటం చూచి చకితులైనారు.

మంత్రి పరమదుర్మార్గుడనీ, కంటికి కనబడితే ప్రాణాలతో వదలవద్దనీ చెబుతూ వచ్చిన వైద్యుడు తనే మంత్రితో కలిసి వుండటం విడ్డూరంకదూ! మరి, ఇప్పుడేమిటి చేయటం? ఒక్కసారిగా వాళ్లమనస్సులో ఆలోచనలు గిర్రునతిరిగినై :




కత్తులుదూశారు. మంత్రిపైన పడబో యారు. వైద్యుడు అడ్డుకున్నాడు.

"తొందరపడకండి. మన మంత్రి నిర్దోషి. మనం తలచిందంతా అపోహ. దోషి ఎవరో తేలాలి. అందుకోసమే ఇలా తిరుగు లాడుతున్నాం" అన్నాడు.

అందుకు అశ్వికులు—"అదా సంగతి! సరే, అసలు మేమువచ్చింది మహారాజావారి కోసం. శత్రురాజు వచ్చి మనరాజ్యాన్ని చుట్టుముట్టాడు. వశంచేసుకునేటట్టున్నాడు. పరిస్థితి చాలా ప్రమాదంగావున్నది. ప్రభువు ఎక్కడ?" అంటూ వట్టరాని తమ ఆత్రం వెల్లడించారు.

మంత్రీ, వైద్యుడూ ఆశ్చర్యపోయారు. "శత్రురాజా! మన సిబ్బంది ఏమై పోయింది?" అని గద్దించాడు మంత్రి.

"అంతా కర్మ. సిబ్బందిలో మూడు వంతులు మిమ్మల్ని వెతికిపట్టటానికే దేశం నలుమూలలకూ పరుగులెత్తారు. మిగిలిన కొద్దిమంది వల్ల ఏమవుతుంది?" అన్నారు అశ్వికులు.

"సరే, ఇప్పుడే బయలుదేరుదాం. ముందు రాజ్యాన్ని రక్షించుకోవాలి!" అన్నాడు మంత్రి ఆవేగంతో.

"అలాకాదు. మీరు మీప్రయత్నంమీద యిక్కడనే వుండండి. నేను వీళ్లతో వెళ్లి రాజ్యం నిలబడేమార్గం చూస్తాను" అన్నాడు వైద్యుడు.

సరేనన్నాడు మంత్రి. వైద్యుడు అశ్వికులవెంట బయలుదేరాడు.

* * *

అక్కడ దేవాలయంముందు కూర్చున్న శక్తిసింహుడికి మరికొద్దిసేపటికల్లా ఒక చిన్న కునుకుపట్టింది. కునుకులో అతనికి ఒక కల వచ్చింది :

తనరాజ్యం అంతా అల్లకల్లోలమై పోయిందట; ప్రజలు విచ్చలవిడిగా సంచరిస్తున్నా




రట; ఈ అదను చూచి, శత్రురాజు సైన్యంతో వచ్చి రాజ్యాన్ని చుట్టుముట్టినాడట.

కలవరపడుతూ మేల్కొంచాడు శక్తి సింహుడు. చూడగా దేవాలయద్వారం ముందే వున్నాడు! ఇదంతా కల అని ఊహించాడు. కల గాసిన దృశ్యాలతో మనస్సు ఆవేదనా పూరితమైపోయింది.

శక్తిసింహుడికి కలలంటే ఎంతో నష్టకం. కలలో కనుపించినవి జరిగేవుంటవని భయం కూడాను. ఈ భయంతో ఒక్కసారి రాజ్యం ఎలావున్నదో స్వయంగా తెలుసుకొంటేగాని స్థిమితంచిక్కేటట్టు తోచలేదు. లేచి రెండు రోజులకల్లా కొండ దిగుపకు చేరుకున్నాడు.

విధీ విరామం లేని శ్రమదమాదులతో శక్తిసింహుడు అలసిపోయాడు. ఇంత కాలమూ గుఱ్ఱం ఉండటంవల్ల యెంత దూరం ప్రయాణించేసినా కష్టం తెలిసి రాలేదు. ఇప్పుడు అడుగుపడటమే అసాధ్యంగా తోచింది. డస్సిపోయి ఒక చెట్టు నీడని విశ్రమించేసరికి ఇట్టే నిద్రపట్టేసింది. ఆ నిద్రలో మళ్ళీ కలగన్నాడు. ఇందాకటి కల పూర్తిగాక, మళ్ళీ ఇలా స్వప్నావస్థలో పడ్డాడో యేమో! కలలోవిశేషాలు ఇవి— తను కొండపైని దేవాలయం చేరుకున్నట్టూ, తలుపులు తెరిచేవున్నట్టూ, లోపలికి ప్రవేశించి వెళ్లగా ఒక తోటలో యిద్దరు చిన్ని కుర్రవాళ్లు ఆడుకొంటూ న్నట్టూ కనిపించింది. ఆడుకొంటూవున్న ఆ కుర్రవాళ్లలో ఒకడు తన మేనల్లుడైనట్టు స్పష్టంగా కనిపించింది!

ఎప్పుడైతే దేవసింహుడు కనుపించాడో "ఏమిటిది! నా దేవసింహుడే" అంటూ వానిని చేతులలోకి తీసుకోబోతుండగా మెలకువ వచ్చేసింది. ఈ స్వప్నంతో శక్తి సింహుడి ఆవేదన మరింత హెచ్చిపోయింది.

"ఏమిటీ కలలు! ఈ విపరీతం!! నా రాజ్యం శత్రురాజుచేతులలో పడబోతోందా!

నేను చేతులారా తెగటార్చిన దేవసింహుడు ఇంకా బ్రతికివున్నాడా!" అనుకుంటూ, ఒకవంక నిస్పృహతో, మరొకవంక ఆశతో, మళ్లీ ఒకసారి దేవాలయం చేరుకుందామని కొండపైకి బయలుదేరాడు.

కొద్దిరోజులకల్లా కొండపైకి చేరుకొని దేవాలయంవైపు అడుగులువేసేటంతలో తలుపులు తెరుచుకున్న శబ్దమైంది. శక్తిసింహుడికి ప్రాణం లేచివచ్చింది. అటు చూచేసరికల్లా ఒక చిన్ని కుర్రవాడు దేవాలయంలోనుండి బయటకువచ్చి, చరచర వెళ్ళిపోయాడు.

ఆ కుర్రవాడు బయటికి వచ్చేయటంతో ఆలయం తలుపులు ఎప్పటిలా మూసుకున్నై. శక్తిసింహుడు ఆ కుర్రవానిని వెంబడిద్దామని బయలుదేరాడు.

కొంతదూరం వెళ్లేసరికి, ఆ కుర్రవాడు దేనికోసమో వెతుకుతూవుండటం కనుపించింది. శక్తిసింహుడు కుర్రవానిదగ్గరకు వెళ్ళి, "అబ్బాయీ, ఏమిటి వెతుకుతున్నావ్!" అని అడిగాడు.

"మేము ఆడుకొనే బంతి ఇక్కడెక్కడో పడిపోయింది" అన్నాడు కుర్రవాడు.

తనవద్దనున్న బంతితీసి చూపుతూ "ఇదేనా?" అని ప్రశ్నించాడు శక్తిసింహుడు.

"ఆఁ, ఆఁ, ఇదే దీనికోసమే మా నేస్తం ఏడిచి రాగాలెడుతున్నాడు" అన్నాడు కుర్రవాడు.

"పాపం! మీ నేస్తానికి యిచ్చిపద్దాం పద" అంటూ శక్తిసింహుడు ఆ కుర్రవాడిని అప్యాయంగా ఎత్తుకుని దేవాలయం దిక్కుగా బయలుదేరాడు.

---

[శక్తిసింహుడికి చిక్కకుండా దేవసింహుడు తప్పించుకోగలడా? తిరిగి ఇప్పుడు ఒంటరివాడైన మంత్రిగతి ఏమవుతుంది? ఇంతకూ శక్తిసింహుడి రాజ్యం శత్రురాజు వశమైపోతుందా?—ఇవీ మరికొన్ని చిత్రసంఘటనలూ వచ్చేనెల]






## 9

[రాజ్యం శత్రురాజుచేతులలో పడబోతున్నదనే వార్త భటులవల్ల తెలియగా, దేవసింహుణ్ణి వెతికే భారం మంత్రికి వదలి, రాజ్యాన్ని సంరక్షించేందుకుగాను వైద్యుడు యింటి ముఖం పట్టటం, అనేక విపరీతపు కలలుగన్న శక్తిసింహుడు చివరకు దేవసింహుడున్న దేవాలయంలో ప్రవేశించబోవటంవరకూ చదివారుకదూ? ఆ తర్వాత—]

కుర్రవానిని ఎత్తుకొని శక్తిసింహుడు ఆలయంలో అడుగుపెట్టాడు. అయితే కుర్రవాడు శక్తిసింహుణ్ణి సరాసరి దేవసింహుడివద్దకు తీసుకుపోలేదు. అక్కడి వింతలన్నీ ఒక్కొక్కటే చూపిస్తూ "ఇక్కడికి మాలాంటి పిల్లలు తప్ప యింకెవ్వరూ రాకూడదు. మా అమ్మ వచ్చేలోగా మా బంతి మాకిచ్చేసి త్వరగా వెళ్ళిపో" అన్నాడు.

ఇది వినటంతో శక్తిసింహుడి ఆశ్చర్యం మరింత ఎక్కువైంది. ఏమైనా సరే ఈ దేవాలయ రహస్యం ఏమిటో, కలలో తనకు కనుపించినట్లు దేవసింహుడు ఆ లోపల వున్నాడో లేడో రూఢిచేసుకొనిగాని పోకూడదని నిశ్చయించుకున్నాడు. ఈ నిశ్చయంతో, "ఫరవాలేదులే. మీ అమ్మతో నేను చెబుతాలే" అంటూ కుర్రవాడిని లాలించి ఎత్తుకుని ముందుకు సాగిపోయాడు.

ఇంతలో సింహాలూ, పెద్దపులులూ అరుస్తున్నశబ్దం చెవినిపడింది. ఏమిటిచెప్మా అని ఆలోచిస్తూండేటంతలో ఆ పులులూ, సింహాలూ ఒక్కపరుగున శక్తిసింహుడివైపు ఎగసి వస్తుండటం కనుపించింది.

శక్తిసింహుడు వెనుదిరిగి చూడకుండా పరుగుచ్చుకుని ఆలయం వెలుపలకు చేరు




కున్నాడు. చంకలో కుర్రవాడు చంకలోనే వున్నాడు. అప్పటికీ ధైర్యం చాలలేదు. అక్కడ వుంటే యింకా ఏమి ప్రమాదం సంభవిస్తుందోనని కొండదిగి పోబోయాడు. యింతలోకే ఆలయం తలుపులు మూసుకు పోయినై. అప్పటికి శక్తిసింహుడి ప్రాణాలు కాస్తంత కుదుటబడినై.

కొంచెం స్తిమితం చిక్కినతర్వాత శక్తి సింహుడు ఆ కుర్రవానిని అడిగిచూచాడు— "ఈ ఆలయం ఏమిటి? దీనిలో ఈ క్రూర మృగాలేమిటి? నువ్వూ, మీనేస్తం వాటి మధ్య ఎలా వుంటున్నారు? ఇంతకూ మీ అమ్మ ఎక్కడ వున్నది?" అని.

అందుకు ఆ కుర్రవాడు, "నాకుమాత్రం ఏంతెలుసు? మేము ఆడుకోవటంకోసం మా అమ్మ వీటిని ఈ గుడిలో పెట్టిపోయింది. వీటితో చక్కా ఆడుకుంటాం. అయితే మా అమ్మ మట్టుకీ అస్తమానం ఇక్కడ వుండదు. ఎక్కడికి వెడుతుందో తెలియదు. అప్పుడప్పుడు వచ్చి మమ్మలిని చూచి పోతూవుంటుంది" అని బదులు చెప్పాడు కుర్రవాడు.

వీళ్ళు ఇలా కూర్చుని మాట్లాడుకొంటూ వుండగా కొండదిగువని అలికిడి ఐంది. శక్తిసింహుడు తేరిపారచూచాడు. 'మంత్రి కాదుకదా?' అని సందేహించాడు. 'అయినా దగ్గిరికి వస్తే తెలిసిపోతుందికదా' అని రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

మరికొంచెంసేపటికల్లా ఆ వస్తున్నవ్యక్తి కొండ సగభాగం ఎక్కాడు. శక్తిసింహుడు లేచి నాలుగడుగులు ముందుకువేసి మరింత పరిశీలనగా చూచాడు. ఆ వస్తున్నది తను అనుకున్నట్టు మంత్రేనని రూఢిఐ పోయింది. మంత్రికంట పడకుండా ఏమి జరిగేదీ తెలుసుకోవాలని శక్తిసింహుడు ఒక పెద్ద బండచాటున నక్కికూర్చున్నాడు. కుర్రవాడూ కూడానే వున్నాడు.



కొంతసేపటికి ఆ బండ ప్రక్కగా ఎవరో నడిచిపోతున్న చప్పుడైంది. ఈమారు శక్తి సింహుడు స్పష్టంగా చూచాడు. మరెవ్వరూ కాదు, మంత్రే! వడివడిగా అడుగులేస్తూ దేవాలయంవైపు పోతున్నాడు.

"ఇదే విధివైపరీత్యమంటే! యిద్దరం ఒకే చోటికి ఎలా చేరుకోగలిగామో! అయినా, ఆలయంతలుపులు మూసివున్నవి కదా, అతడు లోపల ఎలాప్రవేశిస్తాడు?" అని శక్తిసింహుడు తర్కించుకొంటూ వుండగా, ఆలయం తలుపులు తెరుచుకున్న చప్పుడు వినవచ్చింది. అప్పటికప్పుడే మంత్రి లోపల ప్రవేశించటం, తిరిగి తలుపులు ఎప్పటిలా మూసుకుపోవటం జరిగింది.

'లోపలకు ఎలాగో వెళ్లాడేకాని ఆ సింహాలూ, పులులూ బతకనిస్తయ్యా? మరోక్షణంలో బయటపడితీరాలిసిందే' అనుకుంటూ శక్తిసింహుడు ఆ కుర్రవానితో ఊసులాడుతూ అక్కడేవుండి మంత్రి రాకకు ఎదురుచూడసాగాడు.

ఇక లోపలికి వెళ్లిన మంత్రి, ఆలయం లోని చిత్రాలన్నీ చూచుకుంటూ సింహాలూ, పులులూ వున్నచోటికి చేరుకున్నాడు. వాటిని చూడటంతోనే వణుకు పుట్టింది. కాని, ఎప్పుడైతే ఆ క్రూరమృగాలు తన జోలికి రాకుండా వాటిదారిన అవి తిరుగులాడసాగాయో, అప్పుడు "యిక ఫరవాలేదులే" అని పూర్తిధైర్యం చిక్కింది.

అలా పోయిపోయి మంత్రి దేవసింహుడు ఉన్నచోటు చేరాడు. దేవసింహుడు గాఢ నిద్రలో మునిగివున్నాడు. కుర్రవాని ప్రక్కన కూర్చుని ముఖంలోకి పరీక్షగా చూచాడు. కనురెప్పలు బాగా ఉబికివున్నై. బుగ్గల పైన కన్నీటిచారికలు కనుపించినై. వెక్కివెక్కి ఏడ్చి, అలసి అలా నిద్రపోతున్నాడని గ్రహించాడు. మేల్కొల్పటం మంచిదికాదని తలచి, మరికొంత ముందుకు సాగాడు.




కొంచెందూరం పోయేసరికి దేవాలయపు చుట్టు గోడలు అడ్డుతగిలినై. దాటి పోయేందుకు దారిలేదు. తిరిగి దేవసింహుడి దగ్గరకు చేరుకున్నాడు. అప్పటికి దేవసింహుడు నిద్రనుంచి లేచి ఏదో తీవ్రమైన ఆలోచనలో మునిగి వున్నాడు. మనిషి వస్తున్న అలికిడికావటంతోటే బిత్తరపోయి చూచాడు. తన అపూర్వసాధంలో అంతకు మునుపే పరిచయమై వుండటంవల్ల దేవసింహుడు మంత్రిని యిట్టే గుర్తుపట్టాడు.

"ఇక్కడికెలా వచ్చారు మీరు? మా నేస్తం ఏ మయ్యాడు?" అంటూ ఆత్రంతో ప్రశ్నించాడు దేవసింహుడు.

అందుకు మంత్రి, "ఎలా వచ్చానో యేమో నాకే తెలియదు. సరేకాని, నేస్తం అన్నావే, ఎవరు ఆ నేస్తం?" అని అడిగాడు.

"నాకు తోడుగా వుండి ఆడుకోటానికి మా అమ్మ ఒక కుర్రవాడిని యిక్కడ వుంచి వెళ్ళిందిగా. మేము బంతిఆట ఆడుకుంటూవుంటే అది బయట పడిపోయింది. దానిని వెతికితెస్తానని వెళ్లాడు మా నేస్తం. రెండురోజులైంది. యింకా తిరిగిరానేలేదు. ఎక్కడికి పోయాడో యేమో!" అన్నాడు దేవసింహుడు విచారంగా.

"అలాగనా పాపం! పోయి వెతుకుదాం పద" అంటూ మంత్రి దేవసింహుడిని ఎత్తుకుని ఆలయం వెలుపలకు వచ్చాడు.

అప్పటికింకా శక్తిసింహుడు ఆ కుర్రవానితో ముచ్చటలాడుతూనే వున్నాడు. మంత్రి రావటం అతను గమనించనేలేదు. అయితే మంత్రిమాత్రం అతడిని చూచాడు.

చూచీచూడటంతోనే మంత్రి సందిగ్ధంలో పడ్డాడు. ఇంతదూరం వచ్చాక, యింకా తప్పుకొనితిరగటమా, ఎదటబడి అటో ఇటో తేల్చుకోవాలిగాని?—ఒక్కక్షణం ఆలోచించి, కంటపడకుండా పోవటమే మేలని నిశ్చయించుకున్నాడు మంత్రి. దేవసింహు

డితోసహా ఒక్కనిముషంలో అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

కొంచెంసేపటికి తను వచ్చినపని గుర్తు వచ్చింది శక్తిసింహుడికి.

"లోపలకు వెళ్ళిన మంత్రి ఏమైనట్టు? ఎంతకూ బయటపడడేమిటి? ఇంతకూ మృగాలనుండి తప్పించుకుని లోపల ఎలా తిరుగుతున్నాడు!" అని తనని తనే ప్రశ్నించుకున్నాడు. ప్రశ్నలకు సమాధానం దొరకక, ఏమీ పాలుపోక శక్తిసింహుడు అక్కడనే వుండి మంత్రి ఎప్పుడు వస్తాడా అని నిరీక్షిస్తునేవున్నాడు.

* * *

అక్కడ రాజధానిలో — భటులతోసహా వైద్యుడు చేరుకొనేసరికే పరిస్థితి చాలా క్లిష్టమైవుంది. శత్రుసేన వేలసంఖ్యలో వున్నదాయె. దాసోహంకావటంకన్న గత్యంతరం కనుపించలేదు వైద్యుడికి.

భటులతోసహా శత్రురాజువద్దకు బయలుదేరాడు. తీరా అక్కడకు చేరుకునేటంతలో ఒక చిత్రం జరిగింది. చూస్తూన్నంతలో బ్రహ్మాండమైన సుడిగాలి రేగింది. శత్రుసేన ఎండిన ఆకులకుమల్లే అల్లల్లాడిపోయారు. మరుక్షణంలో వాళ్లు చుట్టుముట్టిన కోట



కాస్తా అదృశ్యమైపోయింది. తక్షణమే సుడిగాలి ఆగిపోయింది.

శత్రురాజు నివ్వెరపోయాడు. "ఏమిటీ వింత? కోట ఏమైంది? ఇప్పుడు ఏంచేదాం?" అని సేనాపతిని ప్రశ్నించాడు. ఎవరు చెప్పగలరు సమాధానం?

"ఇప్పటిలో మనం చెయ్యగలిగినది ఏమీలేదు మహారాజా! తిరిగిపోవటమే ఉత్తమం" అని సలహాయిచ్చాడు సేనాపతి.

రాజుకి అంతకంటె ఆలోచన తోచలేదు. వెంటనే సైన్యంతో తిరుగుముఖంపట్టాడు.

శత్రుసైన్యం పొలిమేర దాటేవరకు, వైద్యుడు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని



తప్పుకొని తిరిగాడు. తర్వాత రాజధాని ప్రవేశించి చూడగా, కోటమాత్రమేకాదు, ఇళ్లన్నీ మాయమైపోయివున్నై. జనం గుంపులుగా చేరి గుసగుసలాడుకొంటున్నారు.

వైద్యుడినిచూడగానే అంతావచ్చి చుట్టుముట్టారు. "ఎప్పుడు వచ్చారు మీరు? మహారాజావారు ఏమయారు? యిప్పుడు జరిగిన వింత చూచారుకద! ఈ మాయ ఏమిటో అర్థమైందా? నిలువ నీడలేకుండా పోయిందే! ఏమిటి గత్యంతరం?" అంటూ ప్రశ్నలు కురిపించారు.

అందుకు వైద్యుడు "మహారాజావారి సంగతి నాకూ తెలియదు. శత్రుసేన వచ్చి మన రాజ్యాన్ని చుట్టుముట్టినట్టు తెలిసి వచ్చాను. తీరా కథ యిలా అడ్డంతిరిగింది. అయితే మీరు అధైర్యపడకండి. ఈ మాయ ఏమిటో త్వరలోనే బయటపడుతుంది. అప్పటివరకూ..." అని ఏమో చెప్పబోతుండగా మళ్ళీ సుడిగాలి రేగింది.

ఎక్కడివాళ్లక్కడ ప్రాణాలు బిగబట్టుకుని నిలుచుండిపోయారు. అంతలోనే సుడిగాలి తగ్గింది. కోటా, భవనాలూ యెప్పటిలా ఏర్పడినై. అయితే, ఈమారు మరొకచిత్రం జరిగింది.

వైద్యుడి తలమీదుగా చిత్రమైన చప్పుడైంది. తలయెత్తిచూస్తే, యింతకాలంగా ఎదురుచూస్తూవున్న వృద్ధురాలే ఆమె!

ప్రాణం లేచివచ్చింది వైద్యుడికి. ఎలాగైనా ఈమారు వృద్ధురాలితో మాటలాడాలి. దిగిరమ్మని చేతితో సంజ్ఞచేశాడు.

వృద్ధురాలు దిగబోయింది. తీరా దగ్గరకు చేరుకొగానే ఆమె ఒకపెద్ద పక్షిగా మారిపోయి, వైద్యుడిని కాళ్లతోపట్టుకుని క్షణంలో రివ్వున ఆకాశానికి ఎగిరిపోయింది!

భటులు నిస్తబ్ధులైపోయారు. పక్షివెళ్ళిన దిక్కుకి రెప్పవాల్చకుండా చూస్తుండగానే అది చూపుకి అందకుండా పోయింది.

వెళ్ళివెళ్ళి అది కొండపైని దేవాలయ ద్వారంవద్ద ఆగింది. ఆగటంతోనే పక్షి రూపుపోయి వృద్ధురాలుగా మారిపోయింది.

ఇంతకాలమూ శక్తిసింహుడు ఆలయం లోనే వున్నాడు. పక్షి చప్పుడు చెవినిపడ టంతో తిరిగిచూచాడు. చూస్తే పక్షి ఏదీ? వైద్యుడూ, వృద్ధురాలూ తనవైపుకే వస్తున్నారు!!

శక్తిసింహుడుకూడా లేచి వాళ్లవైపుకి సాగాడు. దగ్గరగా రావటంతోనే శక్తిసిం హుడూ, వైద్యుడూ ఒకరినొకరు చూచు కుని ఆశ్చర్యపోయారు. అయితే శక్తిసిం హుడితోపాటు వున్న ఆ కుర్రవాడు దేవ సింహుడేమోనని భ్రమపడ్డాడు వైద్యుడు. తీరాచూస్తే కాదని తేలింది.

దేవాలయంలో వుంచిన ఈ కుర్రవాడు బయటకు ఎలావచ్చాడు? రావటమేకాక పరమ దుర్మార్గుడైన శక్తిసింహుడి చేతులో ఎలాపడ్డాడు? ఇదిచూచి వృద్ధురాలుకూడా ఆశ్చర్యపోయింది. ఇంతకూ దేవసింహుడు ఏమైనట్లు? ఈ ప్రశ్నలన్నీ వృద్ధురాలినే కలవరపరిచినై.

ఆమె కుర్రవానిని చేరదీసుకోబోయింది. అనుమానిస్తూ శక్తిసింహుడు వానిని కిందకు




దించాడు. వృద్ధురాలు ఆ కుర్రవానిని చంకనెత్తుకొని చరచర ఆలయంవైపు పోయింది. వైద్యుడూ, శక్తిసింహుడూ ఆమెవెళ్ళినదిక్కుకే చూస్తూ నిలబడి పోయారు. మరుక్షణంలో ఆలయం తలు పులు తెరుచుకోవడం, వృద్ధురాలు లోపల ప్రవేశించగా తలుపులు ఎప్పటిలా మూసుకు పోవడం జరిగింది.

తర్వాత శక్తిసింహుడూ, వైద్యుడూ సావ కాశంగా కూర్చుని మాట్లాడుకున్నారు. మంత్రిని తను కలుసుకున్నది మొదలూ అప్పటివరకూ జరిగిన చిత్రాలన్నీ వైద్యుడు శక్తిసింహుడితో పూసగుచ్చినట్టు చెప్పాడు

అంతా వింటూంటే శక్తిసింహుడి ఆలోచనలు పరిపరివిధాల పోయినై. "దేవసింహుడు బ్రతికేవున్నాడా? రాజ్యం శత్రురాజు చేతులలో పడికూడా తిరిగి దక్కిందా? ఇన్ని జరిగినా మంత్రీ, దేవసింహుడూ ఏమైనారో తెలియనేలేదా!"— ఈ చిత్రాలన్నీ నమ్మలేకపోయాడు శక్తిసింహుడు.

చివరకు అతడు వైద్యుడి పాదాలపైన పడి, "నన్ను క్షమించండి. ఇన్నికష్టాలకూ కారకుణ్ణి నేను. నా పాపాలకు ప్రతిఫలంగా సంసారంలో కలిగిన ఛిద్రాలు మీకు తెలియనేతెలుసు. పైగా, ఇప్పుడు నేను అనుభవిస్తున్న యమయాతన ఏమని చెప్పుకొనేది? ఎలాగైనా దేవసింహుడిజాడ తెలుసుకోండి. మంత్రి ఏమైనాడో ఆచూకీ తీయండి. మంత్రి ఏపాపమూ ఎరుగడు. నిర్దోషి.

"రాజ్యాన్ని నేను ఏనాడో ప్రజలకు వదిలివేశాను. నా చిట్టితండ్రి దేవసింహుడిని తెచ్చి పట్టాభిషేకం చేయించండి. వాడికి తలిదండ్రులు లేని కొరత మీరూ, మంత్రీ తీర్చాలి. ఇంతటి పాపభారంతో నేను మళ్లా ప్రజలకంటపడటం వట్టిమాట. ఎలాగో ఇక్కడనే కాలం వెళ్ళబుచ్చుతా. ఆశీర్వదించండి" అంటూ వలవల ఏడ్చాడు.

వైద్యుడి గుండె నీరైంది. శక్తిసింహుడికి ధైర్యంచెబుతూ, 'రాజా!—దేవసింహుడి ఆచూకీ మనకు చిక్కదు. అందుకు అమానుషశక్తులు కలిగిన ఆ వృద్ధురాలే సమర్థురాలు. కనుక వెళ్ళి ఆమెనే ఆశ్రయిద్దాం' అని ఊరడించాడు.

అయితే, గుడితలుపులు మూసివుండటం చేత, వృద్ధురాలికోసం వాళ్ళు అక్కడనే వుండి ఎదురుచూడవలసి వచ్చింది.

---

[తలవనితలంపుగా వచ్చిన ఈ మార్పు శక్తిసింహుడిలో అలాగే నిలిచివుంటుందా? ఇంతకూ దేవసింహుడూ, మంత్రీ ఏమైనట్టు? వృద్ధురాలి వల్ల శక్తిసింహుడికి ఏమైనా సహాయం లభిస్తుందా? ఇవీ, మరికొన్ని చిత్రాలూ వచ్చేనెల చదవండి.]






## 10

[ఆలయంలో పులులూ సింహాలూ మీదికిరాగా శక్తిసింహుడు పారిపోవటం, మంత్రి తారసపడి దేవసింహునిదగ్గర చేరుకోవటం, వైద్యుని పరిస్థితి క్లిష్టంకావటం, వైద్యుడికి పక్షిరూపంలో వృద్ధురాలు కనిపించటం, అది ఆలయానికిపోయి శక్తిసింహుణ్ణీ వైద్యుణ్ణీ కలియటం, దేవసింహుడినిగురించి యోచనచేయటంవరకూ చదివారుకదా ?—తర్వాత]

ఆలయంలోకి వెళ్ళిన వృద్ధురాలు దేవసింహుడికోసం వెతికి, వాడు కనపడక పోయేసరికి, బయటకు వచ్చేసింది. ఆమె ఎప్పుడు బయటకు వస్తుందా, అని ఎదురు చూస్తున్న శక్తిసింహుడూ, వైద్యుడూ ఆమె రావటం గమనించి, ఆమెవద్దకు పోబోయారు. కాని వృద్ధురాలు వారిని గమనించనట్టే సాగిపోయింది. పైగా రివ్వున ఆకాశమార్గాన ఎగిరిపోయింది. శక్తిసింహుడూ, వైద్యుడూ నిస్తబ్ధులైపోయారు.

దిగువని ఒకచోట దేవసింహుడితోసహా మంత్రి కనుపించాడు వృద్ధురాలికి. ఆమె క్రిందకు దిగివచ్చి మంత్రివంక, దేవసింహుడివంక తేరిపార చూచింది. ఆమె చూపుల అర్థం గ్రహించాడు మంత్రి.

అప్పుడు వృద్ధురాలు, "నేను ఎన్ని విధాల రక్షించాలని ప్రయత్నించినా ఫలితం లేకుండా పోయిందే అని భయపడ్డాను. ఆ శక్తిసింహుడిచేతిలోనే పడితే కుర్రవాడు ఏమయ్యేవాడో! వాడిని పట్టాలని వాళ్ళు అన్ని ప్రదేశాలూ గాలిస్తున్నారు. కనుక జాగ్రత్తగా వుండాలి. అందుకు అపూర్వసౌధం కంటే సురక్షితమైన చోటు మరిలేదు. నాతో రండి. మిమ్మల్ని అక్కడ చేరుస్తా" అన్నది.



అందుకు మంత్రి, ఆత్రంతో "ఇంకా యిలా ఎంతకాలం? మా తల్లి దేవప్రియ ఏమైంది? శక్తిసింహుడి సంగతి అటోయిటో తేల్చుకొనటం మంచిదికదా," అన్నాడు.

"తొందరపాటు పనికిరాదు. అతడే దారికి వస్తాడు. అప్పటివరకూ మనం కుర్రవాడిని రక్షించాలి" అన్నది వృద్ధురాలు.

కాదనలేకపోయాడు మంత్రి. అతడూ, దేవసింహుడూ వృద్ధురాలితో బయల్దేరారు.

అక్కడ శక్తిసింహుడూ, వైద్యుడూ ఏమైనారో చూదాం:

తిరిగి వృద్ధురాలు వస్తుందేమోనని చూచి చూచి, శక్తిసింహుడు నిరాశచెందాడు. "ఆమెకోసం ఎదురుచూచి ప్రయోజనం లేదు. వెతకాలంటే ఓపిక లేదు. కనుక నాదారిన నన్ను పోనివ్వండి. ఏనాటికైనా దేవసింహుడిజాడ తెలుసుకుని అతడి రాజ్యం అతడికి వప్పచెప్పేభారం మీదే" అంటూ, వైద్యుడివద్ద సెలవుకోరాడు.

వైద్యుడు ఎన్నో విధాల నచ్చచెప్పాడు. నిరుత్సాహ పడవద్దన్నాడు. కాని శక్తిసింహుడు వినేధోరణిలో లేడు.

"క్షమించండి. మీ కోరికను మన్నించలేను. జీవితశేషం నిశ్చింతగా జరిగిపోయేటట్టుమాత్రం ఆశీర్వదించండి. అంతే," అని ప్రాధేయపడ్డాడు. అతికష్టంతో వైద్యుడు శక్తిసింహుడిని సాగనంపాడు.

ఇప్పుడు వైద్యుడు ఏకాకి ఐపోయాడు. తను ఎక్కడికి పోవాలో, ఏమి చెయ్యాలో ఏమీ పాలుపోయిందికాదు. అందుచేత లక్ష్యంలేకుండా రాత్రనక పగలనక కాలినడకని అలా సాగిపోతూనేవున్నాడు.

* * *

విధీవిరామంలేకుండా శక్తిసింహుడుకూడా ఏకబిగిని సాగిపోతునేవున్నాడు. పోయిపోయి అతడు కొన్నాళ్ళకు ఒక మహారణ్యం చేరుకున్నాడు. తిండీ నిద్రా లేక, నడుస్తున్న

వాడు నడుస్తున్నట్టుగానే ఆ అరణ్య మధ్యంలో స్పృహతప్పి పడిపోయాడు.

ఎంతసేపు పడివున్నాడో తెలియదు. తిరిగి స్పృహవచ్చి కళ్ళుతెరిచి చూచేసరికి ఒక చిన్న కుటీరంలో వున్నాడు. ప్రక్కని ఒక పండువృద్ధు కూర్చునివున్నాడు.

శక్తిసింహుడు కళ్ళు తెరవగానే ఆ వృద్ధుడు ఒక కమండలువుతో నీరుతెచ్చి శక్తిసింహుడికి అందించాడు. అది పుచ్చుకోగానే శక్తిసింహుడు తేరుకున్నాడు. తేరుకుంటూనే, "స్వామీ, తమరెవరో నన్ను రక్షింపవచ్చిన దేవదూతలు. తమ కుటీరంలోకి నేను ఎలావచ్చాను స్వామీ!" అని ఆశ్చర్యంతో అడిగాడు.

అందుకు వృద్ధుడు "ఆపదలో నున్న వారిని ఆదుకొనటమే నాధర్మం. ఈ అడవిలో పశు పక్ష్యాదులే నాకు తోడునీడలు. ఈ నిర్జనప్రదేశంలో మీవంటి దీనుల చరిత్ర నాకు వాటివల్లనే తెలిసివస్తుంది. చేతనైన సహాయంచేసి కృతార్థుడ నవుతుంటాను. ఇంతకూ తమరెవరో...?" అన్నాడు.

"స్వామీ! నేనొక నిర్భాగ్యుడను. అమాయకులను అగచాట్లుపాలు చేసినందుకు శిక్ష అనుభవిస్తున్న మహాపాపిని.




మహాత్ములను సేవించుకుంటూ జీవితశేషం వెళ్లబుచ్చాలనే యిలా బయల్దేరాను" అని బదులు చెప్పాడు శక్తిసింహుడు.

అప్పుడు వృద్ధుడు 'నావల్ల కాదగిన సహాయం చేయటానికి యత్నిస్తాను' అని అభయమిచ్చాడు.

అంతట శక్తిసింహుడు తన జీవిత వృత్తాంతం అంతా ఉన్నది వున్నట్టు మహాత్మునికి విన్నవించుకున్నాడు. అంతా విని వృద్ధుడు, "పాపంచెయ్యని జీవి ఎవరు! ఈ ప్రపంచంలో ప్రతిజీవీ పాపంచేస్తూనే వుంటాడు. అయితే చేసినపాపానికి పశ్చాత్తాపమే పరిహారం. ఇప్పుడు మీరు పొందు




తున్న పశ్చాత్తాపమే మీ పాపాలకు పరిహారమైంది. కనుక గతాన్ని మరచిపోయి తిరిగి మీ మేనల్లుడి జాడ తెలుసుకునేందుకు శాయశక్తులా యత్నించండి. అదీకాక, దారాపుత్రాదులను వారి కర్మానికి వారిని వదిలి ఇలా సన్యసించబూనటానికి శాస్త్రం వప్పదు. మీ ప్రయత్నాలలో అటంకాలు కలగకుండా మీకు జయం కోరేందుకుగాను ఈ మంత్రం పఠిస్తూవుండండి" అంటూ వృద్ధుడు శక్తిసింహుడికి మంత్రం ఏదో ఉపదేశించేశాడు.

తర్వాత శక్తిసింహుడు దేవసింహునిజాడ వెతుక్కుంటూ తిరిగి బయలుదేరాడు.

అలా తిరుగుతూ అతడు కొన్నాళ్లకి ఒక రాజ్యం చేరుకొన్నాడు. నగరపు నడివీథిలో ఒక పెద్ద పిల్లలగుంపు చేరివుంది. ఏమిటి చెప్మా అని దగ్గరకు వెళ్ళిచూడగా ఒక పిచ్చివానిచుట్టూ వాళ్లు గుమికూడి అతడిని వేళాకోళం చేస్తున్నారు.

శక్తిసింహుడు ఆ కుర్రవాళ్లను వారించి, ఆ పిచ్చివానిని తనతోపాటు తీసుకొని సాగిపోయాడు. ఆ పిచ్చివాడు మధ్యమధ్య "ముసిలిది ఎక్కడ? ముసిలిది ముక్కచెక్కలు అయిందా" అంటూవున్నాడు.

"ఎవరా ముసిలిది?" అని శక్తిసింహుడు ప్రశ్నించినప్పటికీ అతనికి సరియైన జవాబు రాలేదు.

ఆ పిచ్చివాని చరిత్ర తెలుసుకోవాలని శక్తిసింహుడు ఎంతగానో యత్నించాడుగాని ఏమాత్రం తెలిసిందికాదు. అయితే ఆ పిచ్చివాడు శక్తిసింహుడిని వదలక అతని వెంట ఉంటూనేవచ్చాడు.

వాళ్లు ఆ రాజ్యం వదిలి మరికొద్ది రోజులకు ఒకగ్రామం చేరుకున్నారు. అక్కడ ఒక చెరువుగట్టున పెద్దగుంపు పోగైవున్నది. ఇద్దరు కుర్రవాళ్లు గారడిచేస్తున్నారు. చెరువుగట్టున రెండుగెడలు పాతివున్నై. వాటి

మధ్యని తీగ కట్టివుంది. ఒక కుఱ్ఱవాడు తీగ ఒక చివరినుంచి రెండోచివరకు చరచర నడిచిపోయాడు. జనం సంతోషం పట్టలేక చప్పట్లు చరిచారు.

శక్తిసింహుడితోకూడా వున్న ఆ పిచ్చి వాడుకూడా పెద్దపెట్టున నవ్వుతూ ఒక్క పరుగున వెళ్ళి గెడపైకి ఎగబ్రాకాడు. తీగె పైకిఎక్కి కోతిలా వేలాడసాగాడు. ఇదిచూచి జనం, "ఎవడువాడు? లాగండి కిందికి" అని అరిచారు. వాళ్లు యిట్లా అనకముందే అంతకుముందు గారడీచేస్తున్న ఆ కుఱ్ఱ వాళ్ళు ఆ పిచ్చివాడిని కాళ్లు పట్టుకుని చరచరా క్రిందికి యీడ్చారు.

తర్వాత గారడీకుఱ్ఱవాళ్లు జోలెలు చేత బుచ్చుకుని చుట్టూచేరిన జనందగ్గర అడుక్కోసాగారు. అలా అడుక్కుంటూ వాళ్లు శక్తిసింహుడివద్దకుకూడా వచ్చి జోలె తెరిచారు. శక్తిసింహుడు జలజలకన్నీరు కార్చాడు. ఇదిచూచి ఆ కుఱ్ఱవాళ్ళు విస్తుపోయారు. "ధర్మం చేయకపోతేపోయె ఈమనిషి ఏడుస్తాడెందుకు చెప్మా?" అని జాలి కలిగింది.

"నీబాధ మేము గ్రహించాం. మాతో పాటు రా. మేము సంపాదించేదాంటోనే



నీకూ కలో గంజో పోస్తాము" అన్నారు ఆ కుఱ్ఱవాళ్ళు.

అందుకు శక్తిసింహుడు, "నేనొక్కడినే కాదు. పాపం ఈ పిచ్చివానినికూడా పోషించాలి. మీవలన ఏమవుతుంది? కనుక మా దారిని పోనివ్వండి" అంటూ తిరిగి కన్నీరు కార్చాడు.

ఇది చూచేసరికి ఆ కుఱ్ఱవాళ్ళ హృదయాలు మరింత ద్రవించినై. "ఫరవాలేదు. మీ యిద్దరూ రండి మాతో. మేము నేర్చిన విద్యలు మీకూ నేర్పుతాం. కొన్నాళ్ళయాక మీరే మమ్మల్ని పోషించగలుగుతారు" అంటూ ఓదార్చి వాళ్ళను తమతోపాటు




తీసుకుని ఆ గ్రామంనుండి మరొక గ్రామానికి బయలుదేరారు.

* * *

ఇక అక్కడ ఏకాకిఅయిన వైద్యుడు కొంత కాలం విధీవిరామంలేకుండా ఎన్నోరాజ్యాలు దాటిపోతూనే వున్నాడు. కాని ఎక్కడా మంత్రిజాడకానీ, దేవసింహుని జాడకానీ తెలిసిరాలేదు.

అయితే అలా మరికొంతకాలం పోగా పోగా అతడు శక్తిసింహుడి పరివారాన్ని కలుసుకోవటం సంభవించింది. ఇప్పుడు శక్తిసింహుడి అవతారం పూర్తిగా మారింది. అతడు ఒక గారడివాని వేషంలో వున్నాడు.

అతనిని వైద్యుడు గుర్తుపట్టలేదు కాని శక్తిసింహుడు వైద్యుడిని యిట్టే గుర్తుపట్టాడు.

గుర్తుపడుతూనే, "తమరిక్కడి కెలా వచ్చారు? ఏమైనా అచూకీ చిక్కిందా?" అని ప్రశ్నించాడు. వైద్యుడివద్దనుండి ఏమీ సమాధానం రాకపోవటంతో శక్తిసింహుడు పరిస్థితి గ్రహించాడు. అప్పుడు శక్తిసింహుడు తనతో వున్న ఆ కుఱ్ఱవాళ్లని పరిచయం చేస్తూ, "తెగిపోయిన గాలిపటంలా తిరుగుతున్న నన్ను ఈ అర్భకులు అదరించి పోషించారు. లేకుంటే ఈ గుప్పెడు ప్రాణాలూ ఏనాడో ఎగిరిపోయేవి. పోతే, మీరుమాత్రం ఒంటిపాటుగా ఎక్కడని కాలక్షేపంచేస్తారు? మాతోపాటు వచ్చెయ్యండి" అని కోరాడు.

కోరికను నిరాకరించి చేసేదేముంది? సరేనన్నాడు వైద్యుడు. నాటినుండీ వైద్యుడు శక్తిసింహుడి పరివారంతోపాటు వుంటూ, వాళ్లువెళ్లిన చోటుకెల్లా వెడుతూ, వాళ్లకి అండగా వుంటున్నాడు.

ఈ పరివారం ఎన్నోదేశాలు పర్యటిస్తూ చివరకు అపూర్వసౌధం దరిదాపులకు చేరుకున్నారు. అంతకుముందుగా పరిచయమైన చోటే కనుక, భవనం కంటబడేసరి

కల్లా వైద్యుడు ఉప్పొంగిపోయాడు. ఆ సౌధంముందర గారడీ ఏర్పాటుచేశారు.

వాళ్ల సందడి చెవినిపడటంతో లోపల వున్న మంత్రీ, దేవసింహుడూ భవనంపై నుండి క్రిందికి తొంగిచూచారు. గారడీ వాళ్ల వింతలుచూచి దేవసింహుడు ఆనంద భరితుడయాడు. క్రిందకు వెళ్లతానన్నాడు. పసివాని కోరిక నిరాకరించలేక, మంత్రి వాడిని ఎత్తుకుని క్రిందకు దిగివచ్చాడు.

ప్రదర్శనంలో మునిగివున్న కుర్రవాళ్ళు మొదట దేవసింహుడి రాక గమనించనే లేదు. కాని కొద్దిసేపటికల్లా దేవసింహుడు వాళ్లకంట పడగానే, ప్రదర్శనం చాలించి ఒక్క పరుగున వానిదగ్గరకు వెళ్ళారు. "ఎవరు? మా దేవసింహుడే!" అంటూ వానిని చుట్టుముట్టారు.

శక్తిసింహుడూ, వైద్యుడూ ఆశ్చర్య పోయారు. "ఈ గారడీకుర్రవాళ్లకీ దేవ సింహుడికీ ఏమిటి సంబంధం? ఇంతకీ ఈ కుర్రవాళ్లు ఎవరు!"అని ఆందోళనచెందారు.

ఇంతలో ఆ కుర్రవాళ్ళు దేవసింహుడిని శక్తిసింహుడికి చూపుతూ, "మాతండ్రి ఈ చిన్నవాడి ప్రాణాలు బలికొన్నాడని మా రాజ్యంలో అంతా అనుకుంటున్నారు. తెలిసి



చేశాడో తెలియక చేశాడో, మాతండ్రి..." అని యింకా ఏమో అనబోతుండగా శక్తి సింహుడు స్పృహతప్పి పడిపోయాడు.

కొద్దిసేపటికల్లా శక్తిసింహుడు తేరు కున్నాడు. తనను యిన్నాళ్ళూ పోషిస్తున్న ఆ కుర్రవాళ్లు తన కొమారులేననీ, ఆ పిచ్చి కుర్రవాడు తన అల్లుడేననీ తేలింది.

వాళ్లని దగ్గరకుతీసి శక్తిసింహుడు భోరున ఏడ్చాడు. ఇంతలో ఎక్కడినుండి వచ్చిందో వృద్ధురాలూ రానే వచ్చింది. వస్తూనే పరి స్థితి అంతా గ్రహించింది. ఆమె శక్తిసింహు డిని దగ్గరకు పిలిచి, "ఇక మీరు మీ రాజ్యానికి వెళ్లండి. పట్టాభిషేకానికి

ఏర్పాట్లు చూడండి. చిన్నారి దేవసింహుడితో నేనూ చేరుకుంటాను" అన్నది.

అయితే దేవసింహుడు వెళ్ళేందుకు సిద్ధపడలేదు. 'నన్ను ఇక్కడనే ఉండనివ్వండి. నాబదులు ఈ కుర్రవాళ్లలో ఎవరికైనా పట్టాభిషేకం చెయ్యండి. ఇంతకాలం ప్రజలను కాపాడలేక అజ్ఞాతంలో వుండి ఈనాడు వెళ్లి ప్రజలకంట పడలేను. అదీకాక ఈ అవిటికాలుతో నేను రాజ్యపాలన చేయగలిగేదేమున్నది" అన్నాడు.

శక్తిసింహుడూ, వైద్యుడూ, శక్తిసింహుడి కుమారులూ, ఎంత బ్రతిమాలినా దేవసింహుడు వినే ధోరణిలో లేడు. ఇదిచూచి వృద్ధురాలుకూడా "బలవంతాన రాజ్యభారం నెత్తినపెట్టి ప్రయోజనంలేదు. కనుక దేవసింహుడు చెప్పినట్టు ఈ కుర్రవాళ్లకే పట్టాభిషేకం జరిపించండి, పోయిరండి" అని సలహాయిచ్చింది. కాని ఎవరూ అందుకు అంగీకరించలేదు.

అప్పుడు శక్తిసింహుడి కుమారులు, "మనవంశంలో మిగిలినవాళ్లం అంతా యిక్కడనే వున్నాము. రాజరికం వెలగబెట్టాలని మాకూ కాంక్షలేదు. నీతోపాటు మేమూ ఈ భవనంలోనే వుండేందుకు అనుమతించు. అదే పదివేలు" అన్నారు.

కొంచెంయోచించి, తరువాత వృద్ధురాలు సరేనన్నది. దేవసింహుడితోపాటు, శక్తిసింహుడూ, వైద్యుడూ, మంత్రీ, శక్తిసింహుడి కుమారులూ ఆ అపూర్వసౌధంలోనే వుండిపోయారు. అయితే ఇదివరకు ఒక్క దేవసింహుడికొరకే ఉద్దేశించబడిన ఆ భవనం యిప్పుడు తక్కిన అందరికీ ఉపయోగపడేటట్లు ఎన్నోసౌకర్యాలతో అమరిపోయింది. ఒకరికొకరు చేదోడువాదోడుగా అందరూ హాయిగా వుంటున్నారు.

ఈవిధంగా, నాథుడు లేని ఆ రాజ్యానికి 'అనాథరాజ్యం' పేరుమట్టుకు చిరస్థాయిగా నిలిచిపోయింది. —(కథ సమాప్తం)

